





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# పురాణ కథా దీపిక





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014987

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

*Approved by the Madras Text-Book Committee for school-use.*

# పురాణ కథా దీపిక.

Supervised by

**B. V. SIVA ROW, B. A., L. T.**
Taluk High School, Tenali.



ఎం. ఎస్. శర్మ అండ్ కో.,
ఎడ్యుకేషనల్ పబ్లిషర్సు,
తెనాలి.

1930

 వెల 0-6-0

# విషయసూచిక

పుట.







# పురాణ కథా దీపిక.

## 1 గోవ్యాఘ్ర సంవాదము

పూర్వమొక విప్రునియొద్ద నొకహోమధేనువుండెను. అయ్యది నిత్య సత్యవర్తిని. సదాచారమూర్తి. ఎన్నడును తోడిగోవులతోడ గలహమునకుఁ బోవదు. తనకుఁ గల్గినంతలోనె సంతుష్టి నొందుచుండును. పిదుకునప్పుడు వృష్టిధారలచెలువునఁ జన్నులుచేపి కుఱియును. ఇట్టి గోరత్నమొకనాఁ డరణ్యమునకుఁ బోయి మేయుచుండ, వ్యాఘ్రం బొకటి పొంచి పొంచి, దానిమీఁదకు లంఘించెను. అప్పుడాసురభి యొక్కింతయుఁ గళవళమందక వ్యాఘ్రమునుఁజూచి "నిలువుము. నిలువుము. తొందరపడవలదు. నాపలుకులు విను"మని పలికెను. ఆమాటలకు బెబ్బులి యాశ్చర్యమంది కొంతసేపటివఱకును చిత్తరువునరూపమువలెనుండెను. పిదప నప్పుండరీకమా ధేనువును విలోకించి "ఆమిషార్థినైవచ్చిన నన్ను వారింపఁ గారణమేమి? నీవేమి చెప్పఁదలఁచితివి."

యని యడిగెను. అందులకు సురభి "నాకొక ముద్దులపట్టి యుండెను. నేటికాతఁడుజనించి యెనిమిదినాళ్లయ్యెను. గరిక దినుట నేరలేదు. కావున నేనరిగి కడుపార జన్నుగుడిపి సత్వరముగ వచ్చెదను. కరుణించి సెలవొసంగు"మనిపలికి, మరలఁ దన యంతరంగమున వత్సము నుద్దేశించి "ఇప్పుడు నా దూడకుఁ జనుఁగుడిపివచ్చెదగాక! ఆపాలుపుడిసెడునఱిగినపిమ్మట దానికేమిగతి? దానికెవ్వరుదిక్కు? నన్నుఁగానకనది యేధేనుపు పొదుగైనఁ గుడువఁబోయినచో నది పొడువకయుండునా? ఏ గొడ్డుటావులయిన దాకునేమో! పొరుగిండ్లకుఁ బోయినచో కుక్కలుపైబడికఱచునేమో!"యని విచారించి,తనవిచారము బయలుపడినచో వ్యాఘ్రము తన్నువత్సమునుఁజూచివచ్చుట కనుజ్ఞనివ్వదేమోయని మరలఁబుండరీకమునుఁజూచి"గుక్కెడు పాలతో నాసుతునకు సంతృప్తి యొదవును. నీకు నామాంసము సమస్తము గొనినఁగాని సంతృప్తి కలుగదు. కావున నీవుకొంచెమోర్చుకొనియుండుము. నేను సత్వరముగఁబోయి వచ్చెద"ననెను. అందులకు వ్యాఘ్రము"గోరాజమా! నీమాటలు నాకు మిగుల నద్భుతము కలిగించుచున్నవి. కొడుకును జూచి వచ్చెదనని పల్కుచుంటివి. ఈమాట నెవ్వరయిన నమ్మెదురా? ఎవరైనను చెప్పినట్లు సేయుదురా?" యనినఁ-ధేను విట్లనెను. "ఓ వ్యాఘ్రరాజమా! నీవు నన్ను విశ్వసింపుము. నేను నాసుతునిఁజేరి పాలిచ్చి, తగు బుద్ధులుచెప్పి, యరుదెంతును. నీవంగీకరింపకయున్న నేనేమియు సేయఁజాలను. అసత్యము చెప్పఁజాలను. అతిథిసత్కారమునకంటెఁ బుణ్యమైన కార్యము మఱియొకటిలేదని ధర్మశాస్త్రములు ఘోషించు

చున్నవి. ఇప్పుడు నీవునాకతిథివైతివి. అట్టిచో నేను నిన్ను విడిచితినేని బాపముసంభవింపదా? కన్నకడుపగుటచేతను, నాతనివిడిచి దూరమరుగునట్టి వేళయగుటచేతను, నింత చనవుఁబూని నిన్ను బ్రతిమాలుచుంటిని. కొంచెము నా యెడలఁ గారుణ్యముఁ బూనుము.''

ధేనువు మాటలు-విని కొడుకునుఁజూచి సత్వరముగ వత్తునని శపథముసేయుమని పుండరీకముపలికెను. అప్పుడు సురభి "నేనుకొమరునిజూచి సత్వరముగ నిటకు రాకయుంటి నేని వెలదుల సంసర్గవిడువలేని యతిపోవుగతికిని, తగవుదీర్పు టకు మధ్యస్థుఁడనని చెప్పి, పక్షపాతమువహించి పలుకువాని గతికిని, వివాహకార్యమునకు భంగముకలిగించువాని గతికిని గోవులుపవాసముండఁ గుడిచినవానిగతికినిఁబోవుదును. గోవు లఁ దన్నువారును, పరాంగనాసక్తులును, యుద్ధమునందుఁ బాఱినవారును బొందుగతిని బొందుదును. అసత్యమాడి పెద్దలకు బాధగల్గించువాఁడును, తల్లిదండ్రులఁ బూజించని వాఁడును, మేఁయుచున్న గోవునదల్చువాఁడును, బొందుదుర్గ తుల నేను పొందుదును. దానమని పేరుపెట్టి విప్రుల కన్య సేవ్యస్థలమిచ్చువాడును, అపరాహ్ణ సమయమున నింటికి వచ్చిన యతిథికన్నముఁ బెట్టనివాఁడును, అర్థాపేక్షనుఁ గన్నియను ముదుసలికిచ్చి పెండ్లిసేయువాఁడును, బోవుదుర్గతి కిఁబోవుదు''నని యనేక శపథములుచేసెను. అంతటఁ బుండ రీకము ధేనువును నమ్మి పోయిరమ్మనెను.

గోవు తిన్నగాఁగడురయమున గృహమునకు వచ్చి యంబారవము గావించెను. ఆ రవము చెవిసోకిన యంతనే

వత్సము చెంగుచెంగున దాటుచుఁదల్లిఁజేరి, చన్నుఁగుడువ సాగెను. అది పాలుద్రాగుచున్నంతవరకును ధేనువు కదలక నిలిచి యుండెను. కడుపునిండినపిదప నావత్సము తోక నెత్తియటునిటు, బరువెత్తసాగెను. ఇట్లు శైశవక్రీడల జెలంగుచున్న తనవత్సమునువిడిచిపోవలసివచ్చెఁగదాయనికన్నీరు నించుచు, జాగుఁజేసినచోఁబుండరీక మాకటి బాధనుమ్రగ్గు ననితలంచి, నెమ్మదిగాఁ వత్సమునుఁజేరి యాసురభి యిట్లనెను. ''వత్సా! నిన్నుఁగన్నదిమొదలింతవరకు గారాబంబునఁబెంచుచుఁజన్నిచ్చుచుంటిని. విధివశమున నీకునునాకును నీదినముతో ఋణము తీరిపోవుచున్నది. ఇఁకనీవు నన్నెన్నఁడును దలంపవలదు. నామీఁద మమకారము విడువుము- మమకారంబును, నహంకారంబును, సంసారానుబంధ రజ్జువులని, పుణ్యపురుషులు వానినివర్జింతురు. నీవెప్పుడును నన్నృతములాడకుము. ఎవ్వరైన నిన్నెగ్గాడినను, నెదురాడవలదు. ఒంటిగాఁ బొలమునఁ జరింపవలదు. ఇంటికిఁజీకటిపడక రావలయు. పోరాడుకొనుచున్న వృషభంబులఁ గదియవలదు. ఎట్టి పచ్చికయున్నను నూతుల దరులను మేయవలదు. ఏనుండుటచేత నిన్నుఁబ్రతివారును ముద్దుసేయుచుండిరి. ఇటమీఁద నిన్నెవరునుఁ గైకొనక చుల్కనగాఁ జూతురు.

"క॥ చులకన జలరుహతంతువు
చులకన తృణకణము దూది ♦ చుల్కన సుమీ
యిల నెగయు ధూళిచుల్కన
చులకన మఱి తల్లిలేని ♦ సుతుఁడుఁ" గుమారా.

కావున నిట్టి లాఘువము గనిపింపకయుండ, సజ్జనులఁ జేరి, వారి హితోపదేశములఁ గైకొనుచు, నిరర్థగోష్ఠికిఁబోవక కీర్తిఁబొందుము."

తల్లివాక్యములువిని, వత్సంబిట్లనెను. "అమ్మా! నేడు నీవీరీతినిబలుకుచుంటివేమి? అర్థకాంక్షంజేసి విప్రుఁడు నిన్నెవ్వరికైన విక్రయించెనా? లేక నేపుణ్యకార్యమునకైన నిన్ను దానమిచ్చెనా? నీవెచ్చటికిఁబోయిన నచ్చటికిని జనుదెంతును''. ఆమాటలకు ధేనువు " కుమారా! ఈవిప్రుడు నన్నెవ్వరికిని నొసంగలేదు. సత్యవాక్య పరిపాలనార్థమై పుండరీకమున కాహారముగఁ బోవుచుంటిని. జనన మరణములు దేహికి సహజములు. కాని యిట్టిచావు నాకు గలుగుట సుకృతంబే యని తలంతును. ఇఁక నీవు నన్నుఁగూర్చి విచారింపవలదు."

ఈపలుకులువిని వత్సము దుఃఖించుచు "నీకు శాశ్వత పుణ్యలోకముఁగలుగునని పలికితివి. నేనుఁగూడ నీవెంట జనుదెంతు" ననెను. అందులకుఁ గపిల యిట్లు బదులు చెప్పెను. "సంతతి యెడతెగినచోఁ బుణ్యగతు లుండవందురు. తల్లిదండ్రులు బ్రతికియున్నంతకాలము సుతుఁడు రక్షించును. వారు మృతులయినపిదపఁ బితృక్రియలనుఁదీర్చి సద్గతులకుఁ బోవఁజేయును. కావునఁ బుత్త్రజన్మము – తల్లిదండ్రులకు ముక్తికిఁదావలము. నిన్నుఁ బుత్రునిగావడసి నేను ధన్యురాలనయితిని. మత్పవిత్రవంశము నీకతంబున భూతలమున నాచంద్రార్క–తారావదీశరధిస్థాయిగ నిలచును. నీవిక ధైర్యమున నుండుము. నాకొఱకై పులి వేచియుండును.

ఇట్లు చెప్పి, వత్సంబు నోడఁబఱచి యాధేనువు కడు రయమునఁ బుండరీకమున్న తావునకుఁ బోయెను. ఇంకను ధేనువు రాలేదని యాకలిచేఁ దపించుచున్న యావ్యాఘ్రము నెదుట నిలిచి సురభి "శార్దూలవరేణ్యా! నీవు నాయెడలఁ జూపిన కరుణకు సంతసించితిని. నీకతమున నా కుమారునిఁ జూచి వచ్చితిని. ఇఁక నీవు నన్నాహారముగాఁ జేసికొని యాకలిఁ దీర్చుకొనుము. నేనుపుణ్యలోకమునకుఁ బోవుదు"న నెను. అంతకుముం దెంతయో యాకలి బాధ నొందుచున్న పుండరీకము-ధేనువునుఁ జూచి, దాని సత్యసంధతకు నచ్చెరువుఁ బొందియట్టె నిలిచియుండెను - త్వరగా నన్నుఁ భుజింపుమని సురభి సమీపించిన కొలఁదిని శార్దూలము వెనుకకుఁ బోవఁ దొడంగెను. ఎంత బలవంతబఱచినను శార్దూలము సురభిం జంప నొల్లక, దానిఁ గాంచి, "గోరాజమా! నీ విమలసత్యప్రౌఢికి మెచ్చితిని. నిన్నుఁ జంపఁ జాల. నీవు నిజావాసముఁ జేరి కొమరునితో సుఖముగా నుండు" మని పలికెను. అప్పుడు గోవు సత్యవాక్శుద్ధికిని - పులి కృపాసమగ్రబుద్ధికిని మెచ్చి శ్రీహరి ప్రసన్నుఁడై వానికి దివ్యపదం బొసంగెను.

## 2- కపోతోపాఖ్యానము

పూర్వ మొక పురమున నొక బోయవాఁడు పక్షులను వధించి, వాని నమ్ముకొనుచుఁ, దనజీవయాత్రఁ గడుపుకొను

 

చుండెను. ఒకదినమున నాకిరాతుఁడు పక్షులనుఁ బట్టుకొనుటకు వలసిన పరికరములఁ దీసికొని, యొక మహారణ్యమున కరిగి, యందుఁ బక్షులకై వలఁబన్ని యుంచెను. అనేకపక్షు లావల యందుఁ బడుచుండెను. అంతలో సంధ్యాసమయ మయ్యెను. అట్టి సమయమున జగత్ప్రళయము సంభవించునేమో యని తోచునట్లు, భయంకరవాయువులతోఁ గూడుకొన్న వర్షము సంభవించి, కాననమంతయు జలమయమై పోవుచుండెను. అప్పుడు పాపాత్ముఁడగు నాకిరాతుఁడు సమీపమున నున్న యొక చిన్న ప్రవాహమును దాటి యచ్చట గుబురుగానున్న యొక వృక్షము క్రిందఁ జేరి, చలిబాధ నొందుచు, శిలయే శయ్యాతలముగఁ జేసికొని "రాత్రియైనది. ఇచ్చట నాకెవ్వరును దిక్కులేరు. నన్ను రక్షించుట కీవృక్షము నాశ్రయించి యుండు భూతములనే నమ్మియుండుగాక" యని పలికి శయనించెను.

ఆసమయమున నావృక్షరాజముపై వసించియున్న యొక కపోతము మేతకరిగిన తన భార్య, చీకటిపడినను రాని కారణము తెలియఁగజాలక యీరీతి విలపించెను. "నాబహిప్రాణ మెచ్చట నున్నదో కదా? ఇంతవఱకు నన్ను విడిచి యెప్పుడు నుండునది కాదు. అది లేకున్నచో నాసౌఖ్య మంతయు నిరర్థకముకదా? అపరిమితానురాగము గలిగి విలసిల్లు భార్యయొక్క సత్ప్రవర్తనము భర్తకిహ పరలోక సౌఖ్యములొనఁగూర్చునని యార్యులు చెప్పుదురు. అక్కటా! అది యీవర్షమున కెక్కడనైన బడి మృతినొందినదేమో! అట్లయిన నాకిఁక నేమిగతి?"

అని శోకించుచు నిట్లు పలికిన వాక్యములు బోయవాని వలయందుఁ జిక్కుకొని యున్న కపోతి యాలకించి, మనంబున మిగుల సంతోషమంది "పతి చిత్తమునకు సంతోషము కలుగునట్లు వర్తించు కాంతయే పుణ్యవతి యనంబడును. నన్నుఁగూర్చి నామనోహరుఁ డిట్లు ప్రేమపూరిత వాక్యంబు లాడ వినఁ గాంచితిని. ఇక నేను ధన్యురాల నయితిని. నేను కాలునినైన గెలిచెద" నని యనుకొని, పతికిఁ దన విధంబు నెఱుంగఁ జేసి భగవంతుఁ డొనర్చిన దానికిఁ జింతించినందు వలనఁ బ్రయోజనము లేదని చెప్పుచు, మఱియు నిట్లనెను. "శరణుఁ బొందినవారిని రక్షించుటయే పరమ ధర్మమని ధర్మ శాస్త్రములయందుఁ జెప్పఁబడియున్నది. ఆ వృక్షము క్రింద నున్న బోయ చలిచే మిగుల వడఁకుచున్నాఁడు. నీచేత నయి నంతవఱకు శరణాగతుఁడయిన వీని నాపదఁ బొందకుండ రక్షింపుము." అని పలికిన కపోతివాక్యములు విని దుఃఖము విడిచి, యక్కపోతము కిరాతుని వీక్షించి మనుజస్వరమున "అన్నా! నీవు మిగుల డస్సియున్నాఁడవు. నా భాగ్యవశ మున నేఁడు మాయింటి కతిథి వయితివి. నీ కెట్టి యాతిథ్యము నేనుసలుపవలసియున్నదో యద్దాని నెఱింగింపు" మనిన నా పక్షిమాఱకుండా కపోతము నీక్షించి "నీపలుకుల కెంతయు సంతసించితిని. చలిబాధచే నాశరీరమంతయు ముద్దయై పోవు చున్నది. ఈబాధ మాన్పు"మని పలికెను. అంతట నక్కపో తము తత్ప్రదేశమున నున్న చిన్న చిన్న పుల్లలన్నియు ముక్కునఁ గొనితెచ్చి ప్రోవుచేసి, సమీపమున నున్న పల్లి

యకుం జని, చివఱ నగ్నియున్న పుల్లం దెచ్చి, యాప్రోవునఁ బెట్టి, బోయను శరీరముఁ గాచుకొనుమని చెప్పెను. ఆలుబ్ధకుండగు కిరాతుఁడు తన మేను నాయగ్నిం గాచుకొని శీతబాధను వాసి, తన కాకలి యగుచున్నదని పక్షికెఱింగించెను. అందుల కుపాయం బేమియుఁ దోఁచక, యక్కపోతము వాని నీక్షించి, "పక్షుల కాహారంబని యొకటి నిర్ణయింపఁబడి యున్నదా! ఏసమయమున నేది దొరకిన నది తిందుము. నీవు మిగుల నాకలిఁ గొనియున్నాఁడవు. ఎట్లయిన నీయాకలిబాధఁ దీర్పవలయును. అందులకై నీకు నాశరీర మాహారముగాఁ జేసెద" నని పలికి యగ్నిం బడెను. ఇట్లు కపోతము తనకై యగ్నిం బడుటఁ జూచి యాకిరాతుఁ డద్భుతమంది; తన మనంబునఁ—"బ్రపంచమున నింతటి కార్యం బెచ్చటనైనఁ గాంచి యుంటినా! నాచరిత్ర మతినిందకుఁ బాత్రమైయున్నది. ఇఁక నేటినుండి యిట్టి క్రూరకార్యము సేయుట మానివేసెదను. నాకీపక్షియే గురుఁడై సద్బోధం గావించెను. ఈకపోతము నానిమిత్తమై తన భార్యను బంధువుల విడిచి యగ్నిం గూలినది. నేనును నిట్టి దుష్కార్యముల విడిచి హరిని సేవించి ముక్తినందెదఁ గాక!" యని వైరాగ్య మనస్కుఁడై వలయందున్న పక్షుల నన్నిఁటిని విడిచి, పక్షులఁబట్టు పరికరములన్నియు నచ్చటనే పాఱవేసెను.

కపోత మగ్నిలోఁ బడుటఁ జూచి కపోతి తన చిత్తమున "నాయాకలిఁ దీర్పకుండ ముందు నీవెన్నఁడు నాహారము గొనవైతివి. నేడు నన్ను విడిచి యరుగుట ధర్మమగునా! నదీ తీరములకునుఁ, బొదలకడకును, నెలమావిగున్నల కడ

కును, విహరించుటకు నీతోఁగూడ నన్నుఁగొనిపోవు నీలీలలు నాకు మఱువ శక్యమగునా! ప్రాణేశ్వరా! నేనుగూడ నీవు చనిన ప్రదేశమున కరుదెంతును. నీవులేకున్న నాకీబ్రదుకేల? ఇరువురమును స్వర్గముననే సుఖముగా నుందమ" ని భర్తం దలంచి దుఃఖించుచు నగ్నింబడి, ప్రాణములవాసి, ప్రకాశమానమైన విమానముమీఁద నమరులు గొలువ దివ్యతేజముతో విరాజిల్లు భర్తంగలిసి స్వర్గమునకుఁ బోయెను.

బోయయు వీరివర్తనముఁ గాంచి, తానుఁగూడ నట్లగుటకుఁ దలంచి, శరీరంబెల్ల ముండ్లచేఁ గీచికొనిపోవఁ గాననమంతయుఁ జరించుచు, నొకచోట దవానలముగాంచి, సంతోష చిత్తుఁడై భగవద్ధ్యానముసేయుచు నందుఁబ్రవేశించి దేవత్వము నందెను.

## 3 ధర్మవ్యాధుఁడు

ధర్మవ్యాధుఁడను వాఁడొక బ్రాహ్మణుఁడు. ఈతఁడు సమస్త వేదశాస్త్రములును సాంగముగాఁ జదివెను. ఈతనికొక రాజపుత్రుఁడు సఖుఁడైయుండెను. మైత్రిఁజేసియీతఁడుగూడ నా రాజపుత్రునితో ధనుర్విద్యాభ్యాసముఁజేసియాతనితోవేటకుఁబోయి మృగముల నేయుచుండెను. ఇట్లుండవిధివశమున ధర్మవ్యాధుఁడు విడిచిన శరము తపము జేసికొనుచున్న యొక మునికిం దాకెను. వెంటనే యమ్మునీంద్రుఁడు నేలఁబడెను. ధర్మవ్యాధుఁడు మిగుల భయంబందుచు మునిని

సమీపించి యనునయ వాక్యంబులఁబలికెను. కాని యమ్ము నీంద్రుఁడు క్రోధము నహించి "నీవు బ్రాహ్మణుఁడవై యుండియుఁ బాపకర్మమునఁ బ్రవేశించితివి. కావున, మృగవ్యాధజన్ముఁడ వగుదువుగాక" యని శపించి, వెండియు గరుణించి "నీవు కిరాతకులమునను జన్మించినను సమస్త ధర్మములును నీకు బోధమై యుండును. గురుపూజ సేయుదువు. అపర జన్మమున బ్రాహ్మణుఁడ వగుదువు" అనిపలికెను. ధర్మవ్యాధుఁడు మునిశాపమునఁ గిరాతుఁడై మృగమాంసమును విక్రయించుకొనుచు గురుశుశ్రూషలు గావించుచుండెను.

ఇట్లుండ కౌశికుఁడను నొక బ్రాహ్మణుఁడు తపశ్శీలుఁడును సంతతాధ్యయన తత్పరుఁడునునై యొకగ్రామమున వసించుచుండెను. అతఁడొక దినమున నొక వృక్షమూలమున నాసీనుఁడై వేదముఁ జదువుకొనుచుండఁ, దదీయశాఖాగతంబైన యొక కొక్కెర యాతనిపై రెట్టవైచెను: అందులకా ద్విజుం డలిగి తలయెత్తి చూచినయంతనే యాకొక్కెర నిశ్చేతనమై నేలంపడి భస్మమయ్యెను. అనంతరము కౌశికుఁడు మధ్యాహ్నం బగుటంజేసి కృతాహ్నిక క్రియావిధానుఁడై గ్రామమున కరిగి, యందు శుచులైన విప్రగృహములకుఁ బోయి భిక్షాచరణము సేయుచు - నొక్క పుణ్యగృహము వాకిటనిలిచి "భిక్షాందేహి" యనినంతనే నాగృహిణి యాతనికి భిక్షనిడుటకు రాబోయెను. ఆక్షణముననే మార్గాయాసమున మిగులడస్సి యామెపతి గృహంబునకు వచ్చెను. అంతటనాశీలవతి, మగనికిసపర్యలఁజేసి, భిక్షుఁగొని బ్రాహ్మ

ఋనకుఁ బెట్టుటకు వచ్చెను. కౌశికుఁ డామెం గాంచి క్రోధ పరిపూరిత చిత్తుఁడై "ఓపడఁతీ! ఇంత సేపటి వఱకును నిలిపి యవమానించితివిగదా! భిక్షుకు వచ్చిన నన్ను మఱచిపోయి తివా! యని పలికెను. అందుల కాపతివ్రతాతిలకము పతికి సపర్యలు సేయుచుండుట జాగైనదికావున మన్నింపుమని ప్రార్థించెను. కౌశికుఁడు దురాగ్రహముదప్పమఱియొండెఱుఁ గఁడు. అందుచేత నాతఁడామెనుజూచి, "బ్రాహ్మణులకంటె నీవిభుఁడెక్కువ వాఁడా! అవమానింపఁబడిన విప్రులకుఁ గోపము వచ్చినచో శైలకాననసాగరనగరసంయుతమైన ధరాచక్రమంతయు నిమిషములో భస్మమగును."

అందుల కాసాధ్వీమణి యాతనికిట్లనెను. "బ్రాహ్మణోత్తమా! నా తెఱంగు నీకెఱిఁగించెదను. వినుము. నాకుఁ బతియే పరమదైవము. నావాఙ్మనఃక్రియలయందుఁ బతి కనుగుణ్యముగ నడచుకొందును. ఇఁక నీసంగతియంతయు నాకుఁ గోచరమయినది నీవతిక్రోధగుణుఁడవు. నీకోపమున నింతకు మున్నే యొక కొక్కెర నిహతంబయ్యెఁగాదే! ఇది మదీయ పాతివ్రత్యమహిమం గాంచితిని. నీవు క్రోధమునువిడువవలయును ధర్మము బహువిధముల నుండును. నీవు కేవలము స్వాధ్యాయ పరుఁడవుగాని ధర్మసూక్ష్మము నెఱుంగవు. కావునఁ దడయక మిథిలాపురమునకరుగుము. అందు జితేంద్రియుఁడును, సత్యవాదియు, మాతాపితృభక్తుఁడును, నగు ధర్మవ్యాధుఁడను కిరాతుఁడున్న వాఁడు. ఆతఁడు నీకుసమస్త ధర్మముల నెఱింగించును" ఇట్లు పలికిన యాసాధ్వి పలుకులకచ్చెరువుఁబొంది, యామెకు నమస్కరించి, సెలవుఁబొంది, ధర్మవ్యాధదర్శన లాలసుండై

పయనంబై యనేక నగరగ్రామంబు లతిక్రమించి చని, మిథిలానగరంబుసొచ్చి, రాజమార్గంబుదఱసి, యచ్చటజనం బులచే ధర్మవ్యాధుఁడున్నతా వెఱింగి,యయ్యెడ కేగి, ముందట నల్పమృగ మాంసఖండముల నంగడింబఱచి, యమ్ముచున్న వాని, ననవరత విక్రయాగత జనసమావృతు, నక్కిరాతుఁ గని, యతి జుగుప్సితంబైన సూణాపణంబు సేరనొల్లకతొలంగి యొక్కయెడ నుండునంతన, నాధర్మవ్యాధుఁడు బ్రాహ్మణుని రాకంగాంచి, యాతనికడకువచ్చి, పరమభక్తి మ్రొక్కి కుశలం బడిగి, బ్రాహ్మణసాధ్వి పంపున నీవిటకువచ్చితివికాదాయని యడిగెను. కౌశికుఁడు ధర్మవ్యాధుని యెఱుక కచ్చెరువు బొందెను. అనంతరము ధర్మవ్యాధుఁడా బ్రాహ్మణుని దన గృహమునకుఁ దోడ్కొనిపోయి బహువిధములఁ బూజించి, అహింసేత్యాది పరమధర్మములఁ గూర్చి యుపదేశించెను. పిమ్మట కౌశికుఁడు ధర్మవ్యాధుని వీడ్కొనినిజగ్రామమునకుఁ బోయి, ధర్మపరుఁడై, పరమేశ్వరధ్యానంబున నుండెను.

ధర్మవ్యాధుఁడును ధర్మవ్రతానుచరుఁడై, యపర జన్మమున భూసురుఁడై విరాజిల్లెను.

“తే॥గీ॥ హింససేయనివాఁడు లేఁ డీజగమున
నొక్కఁడైనను దమతమ యోపినట్లు
హింస తెరవున కెడగల్గి యేఁగవలయు
నదియెసూవె యహింస నా నతిశయిల్లు.”

ఆ॥ పాపవర్తనుఁడు బ్రాహ్మణుండయ్యును
నిజము శూద్రుకంటె నీచతముఁడు

సత్యశౌచధర్మశీలిశూద్రుండయ్యె.
నతఁడు సద్విజుండ యనిరి మునులు.



## 4 నాడీజంఘుఁడు.

పూర్వమొక బ్రాహ్మణుఁడు స్వకులాచారధర్మముల విడిచి, బోయదానిని భార్యగాఁ జేసికొని, యనుదినమునుగిరాతులఁగూడి వేటకుఁబోవుచు, మాంసముఁదినుచు భోగాసక్తచిత్తుఁడై కాలము గడుపుచుండెను. ఇట్లుండిధనమార్గమరసి, కొందఱువైశ్యులతో స్నేహముఁజేసికొని, వారు వర్తకమునకై దేశాంతరముఁబోవుచుండ, నీబ్రాహ్మణుఁడుగూడ వెంటఁ జనెను. వారందఱునునట్లుపోవుచు నొక్క మహారణ్యమునుఁ బ్రవేశించిరి. అప్పుడొక మదగజమాత్రికసంఘముపై గవయ, వారందఱును భయమంది నల్దిక్కులకునుఁ బాఱిరి. భూసురుఁడును నొకమార్గమునుబట్టి పోయిపోయి యొకచో జొంపమై మిగుల పొడవుగలిగియున్న యొక వటవృక్షమును గాంచి, దానిక్రింద సేదఁదీర్చుకొనుట కాసీనుఁడైయుండెను. అప్పుడచ్చోటికి నాడీజంఘుఁడను నామంబునఁ దనరు బక మొకటివచ్చి యాభూసురుని విలోకించి "బ్రాహ్మణోత్తమా! నీవెచ్చటనుండి యెచ్చటికిఁబోవుచు నిచ్చటి కరుదెంచినావు? నిన్నుఁ జూచినయంతనే నాస్వాంతమున సంతసము జనించినది. నీవునాయింటి కతిథివైతి" వని పలికెను. అందులకా భూసురుఁడు కొక్కెరఁజూచి యిట్లు పలికెను. నేనుభూసురుఁడను. నన్ను గౌతముఁడందురు. బాల్యమున నేవిధమగు

శాస్త్రములుఁ జదువక కులధర్మముల నెల్లఁ బరిత్యజించి యొక
బోయతను నాలిగాఁ జేసికొని ధనార్జనాసక్తచిత్తమున వర్త
కులవెంబడి వచ్చుచుండ మహారణ్యమధ్యమున వనగజం
బొకటిమదించిమాపైఁగవిసెను. మేమందఱమునుభయమంది
నలుదెసలఁ బరుగులిడితిమి. భాగ్యవశమున నేనునీనిలయము
జేరుకొంటిని." అనిపలికిన నబ్బకంబుముదంబంది యాబ్రా
హ్మణుని విలోకించి "నీదారిద్ర్యము నేనువాపెదను. నీవిచార
ముడుగుము. నేనొసంగునాతిథ్యముస్వీకరింపు" మనివచియించి
మందాకినీ నదియందుఁ దానుదెచ్చినమత్స్యములనుఁ బక్వము
జేసి, వన్యఫలములతో నాహారముఁ బెట్టి సంతృప్తునిఁ జేసెను.
ఆరాత్రిభూసురుఁడు బకమునిర్మించిన పర్ణసెజ్జం గాలము గడ
పెను. మఱునాడుదయమున నాకొక్కెర భూసురున కిట్లుపలి
కెను. "భూసురోత్తమా! స్నేహితుఁడును, గనకమును, రజత
మును, బుద్ధియును దారిద్ర్యమునువాపునని మున్ను శుక్రుఁడు
చెప్పియున్నాఁడు. ఈనాల్గింటియందును మిత్రుఁడెక్కుడై
తనరుచుండును. నేనునేటినుండి నీకు మిత్రుఁడనై మెలంగు
చుందును. ఇచ్చటికనతిదూరమున మధువ్రజమను పురం
బొండుకలదు. దానినిఁ బరిపాలించు విరూపాక్షుఁడనుదానవుఁ
డు నాకుహితుఁడయి యున్నవాఁడు. నీవు తిన్నగానాతనికడ
కరిగి, నేను, పంపితినని చెప్పుము. ఆతఁడు నీకుఁ గావలసిన
ధనంబునొసంగును."అనిపలికి యామధువ్రజపురమునకరుగు
మార్గముఁ జెప్పెను. అంతట నాభూసురుఁడు బకము చెప్పిన
తెరవు ననుసరించి చని, యాపురంబును జేరుకొని విరూపా
క్షునిగాంచి " నేను నీహితుఁడగు నాడీజంఘుఁడు పంపగా

వచ్చిన భూసురుఁడను. నా దారిద్ర్యబాధ నీవుతీర్పఁగల సమర్థుఁడవని యాతఁడు నన్ను నీకడకుఁబంపె"ను. అని పలికెను రాక్షసేంద్రుఁడాతండధముఁడని గ్రహించి, " నీ వేకులమున జన్మించినాఁడవు. నీవృత్తియేమి? ఎట్టివిద్యల నభ్యసించితివి" యని యడిగెను. ఆబ్రాహ్మణుఁడొక్కింతయు దాచక తన నిజవృత్తాంతమంతయు నాతని కెఱింగించెను. ఆ బ్రాహ్మణుఁ డెట్టివాఁడైనను, నాడీజంఘుని పంపున వచ్చుటంజేసి, సహాయము సేయదలఁచి రాక్షసేంద్రుఁడాతని కాదినంబున వలసిన యాహారము సమకూర్చుటకుఁ దగినవారిని నియమించి మఱునాఁడు భూసురులకుఁ దన యింట విందుఁజేసి, యా బ్రాహ్మణునిగూడ వారిలోఁగలిపి, యాతఁడు మోయలేనంత కనకము - రత్నములు మొదలగునవి యిచ్చి పంపెను. ఆ బ్రాహ్మణుఁడు మిగులముదంబందుచు, నాద్రవ్యమునుమూపును వీపును గొంకుచోవ, మోసికొనిపోయి బకంబున్నస్థలముఁ జేరెను. ఆకొక్కెర యాతని నాదరించి, తనమిత్రునికతమున భూసురుఁడు భాగ్యవంతుఁడయ్యెనని సంతసించుచు, మార్గాయాసమున డస్సియున్న యాతనికిఁ దన పక్షములచే విసరి, యాహారమునఁ దృప్తుంజేసెను. అంత నా రాత్రిబకము నిద్దురబోవుచుండఁ గృతఘ్నుఁడగు నాబ్రాహ్మణుఁడు మఱుచటి దినమున నాహారమునకై యోచించి, "ఈబకము మిగుల మదించియున్నది. దీని నాహారముగాఁ జేసుకొందు'నని తలంచి యొక కాష్ఠముఁ దెచ్చి దానిచేబకమునుజంపి, యీకలఁదీసివేసి, యందు మాంసమును దీసికొని, డొక్క నచ్చటఁ బాఱవేసి పయనమయ్యెను,

అంతనక్కుఁడు దెల్లవాఱినయంతనే విరూపాక్షుఁడు తనమనంబునఁ గలఁతనంది "ఈకలతకుఁ గారణమేమైయుండును. అనుదినంబు నీవేళకు నాసఖుఁడగు నాడీజంఘుఁడు వచ్చుచుండెనే నేడేలరాడు! ఆబ్రాహ్మణుఁడేమయిన నాతని యెడలఁ గీడు తలంచెనేమో?" యని విచారించి భటులఁ బంపెను. ఆభటులువచ్చి కొక్కెర యీకలు తీయఁబడి యుండుటయు దాని డొక్కయుఁజూచి, కడురయమున నరిగి దానవేంద్రునకుఁ దెలిపి యాతని యనుమతిని బ్రాహ్మణుం డరిగినమార్గమునుబట్టి చని, యాతని నెట్టకేలకుఁ బట్టుకొని చేతులు విఱిచికట్టి విరూపాక్షునికడకుఁదెచ్చిరి. ఆతఁడు భటులనుఁజూచి, ఈకృతఘ్నుని నాయొద్దకేల తెచ్చితిరి? వీనిం జంపి తినుఁడు. లేక మఱేమయినఁ జేయుఁడు." అని చెప్పెను అంతటనాభటులు బ్రాహ్మణుని దీసికొనిపోయి పురము బయలునఁ జేర్చి శరీరమునుండి రక్తముకారునట్లు పొడిచి, పాఱవేసినను నాతని నక్కలయినను స్పృశింపలేదు. కృతఘ్నుల శరీరమును నక్కలయినను స్పృశించుటకు రోయునుగదా!

అనంతరము మిత్రుని మృతికి విరూపాక్షుఁడు, మిగుల చింతించుచు, నాతనిడొక్కఁ దేరఁబంచి, దానిందెచ్చిన తరువాత దాని కగ్నిసంస్కారముఁ గావించెను. తరువాతదానవ భర్తకడ కమరేంద్రుఁడువచ్చి హితుని మృతికిఁ జింతించుచున్న యాతనికిట్లనెను. "రాజేంద్రా! నీహితుఁడగు నాడీజంఘుఁడు చతుర్ముఖునకు సఖుఁడు. ఆతనికైనీవువగవవలదు. ఆనాడీజంఘు డనుదినము నతనికడ కరుదెంచుచుండుటకుఁ

జతుర్ముఖుఁడు కోరుచుండును. పలుమాఱు బ్రహ్మపాలికి బోవకుండుటంజేసి, నాడీజంఘుఁడిట్టి యవసరంబొందినాఁడు ఆతఁడు నీకనుంగు నెచ్చెలి యగుటంజేసి, డొక్క కగ్నిసంస్కారంబొనర్చితివి, అది మంచికార్యమే, నీవగ్నిసంస్కారముచేసి వచ్చినతరువాత నాచితిసమీపమున, నొక గోవు తన వత్సమునకుఁ బాలు గుడుపుచుండ, నావత్సమునోటినుండి వచ్చు ఫేనము వాయువశమున బొదపైఁబడెను. ఆకారణమునఁ జతుర్ముఖునిమహిమచేనాడీజంఘుఁడుసజీవుఁడయ్యెను' ఇట్లు చెప్పుచుండఁగనే నాడీజంఘుఁడచ్చటికి వచ్చెను. మిత్రుఁడు సజీవుఁడైనందులకు విరూపాక్షుఁడుసంతోషముతో నాతనిఁ గౌఁగలించుకొనెను. తనమూలముననా బ్రాహ్మణునకట్టిదీనదశసంభవించినదనియెంచి రాక్షసభటులచే శిక్షింపఁబడి, యావల బాఱవేయఁబడిన బ్రాహ్మణుఁడు సుఖియై యుండునట్లు వరమిమ్మనికోరెను. ఇంద్రుఁడట్లనుగ్రహించెను. భటులు భూసురునివిడిచిరి. నాడీజంఘుని కోరిక ననుసరించి విరూపాక్షుఁడా బ్రాహ్మణునకు మరలధనమిచ్చి పంపివేసెను.



## 5 భీష్ముఁడు

కురుకులదీపకుఁడగు శంతనుఁడను రాజేంద్రుఁడొకనాఁడు గంగాతీరప్రాంతారణ్యభూమికి, మృగవిహారమునకుఁ జని, యందందుఁ జరించి డస్సి, యొక్క తరుచ్ఛాయను విశ్రమించియుండెను. ఆసమయమున నాతనికొక భువనమోహిని

యన నొప్పు స్త్రీకనిపించెను. ఆమెం దిలకించినయంతనే శంతనుని చిత్తము చలించెను. ఆమె హృదయమునుగూడ శంతనునియందు జిక్కెను. ఇరువురును గొంతసేపు మౌన ముగ నుండిరి. పిదపనాసతీమణి శంతనునిజూచి "భూకళత్రా! నేను నీహృదయమునందున్న కోరిక గ్రహించితిని. నీవునన్ను సతిగాఁగొనఁదలఁచితివేని, నన్నెప్పుడును నొవ్వనాడననియు నేఁజేయుపనులను వారింపననియు, వాగ్దానమిచ్చి గ్రహింపుము. ఎప్పుడైనను నేనుచేయుపని కాటంకముఁగలిగించితివేని యాక్షణమున నేనిన్ను విడిచిపోవుదు" ననివచించెను. మనుష్య స్త్రీరూపధారిణియగు నాగంగ పలుకులకు సమ్మతించి శంతనుఁడామెను సతిగా గ్రహించి నిజపురమునకుఁ దోడ్కొని పోయెను.

కొన్నాళ్ళకు గంగ గర్భము ధరించియొకకుమారునిఁ గనెను. ఆమె యాశిశువును గంగాజలములందుఁ బాఱవైచెను. ఇట్లేయామెమఱియేడ్వుర సుతులంగని జలంబులందుఁ బాఱవేసెను. ఇయ్యది ఘోరకృత్యమనియెఱింగియుఁ దన్నెక్కడ నాగంగ విడిచిపోవునోయని శంతనుఁడామెను వారింపకయుండెను. మఱికొన్నాళ్ళకామె యష్టమ గర్భమున నొక కుమారుఁ డుదయించెను. ఏమి ప్రయోజన మున్నది! గంగ యాకుమారునిగూడ యథాప్రకారముగ జలములయందు విడువఁబోయెను. ఈసమయమున శంతనుఁడు పుత్రమోహమును విడువఁజాలక గంగంజేరి "నీవు గొడ్రాలివలెనుంటివి. తొలుత నీతోఁ జేసిన బాస ననుసరించి యింతకుమున్ను నీవు కన్నసుతులను గంగ కర్పించు

చుండఁజూచి సహించితిని. ఈసుతునిమాత్రము విడువఁ జాలను. నీఘోరకృత్యమును నేడు సంపూర్తిగ వారింపఁ దలఁచితి''నని కోపముతోఁబలికెను. అందులకామె యిట్లు పలికెను. "నృపాలా! నీకునునాకును సఖ్యమునేటితోసరి. ఇంతవరకును నన్ను నీవెవ్వరిగా భావించితివో? నేనుగంగను. వసిష్ఠుని శాపవశమున వసువులు భూమియందు జన్మింపవలసి వచ్చి నన్నువిలోకించి ''మేమితరులకుఁ బుట్టఁజాలము. నీ యందు జన్మింతుము. చిరకాలము మేము భూమిపై నుండ నియట్లుజేయు''మని పలుకుటఁజేసి వారికి హితము గూర్పఁ నీకుభార్యనైవారింగాంచియట్లనర్చితిని. ఈయష్టమపుత్రుఁడు భూమిపైఁజిరకాలముండియశమందును ఈతఁడు పెద్దవాఁడగు నంతవరకును నాయొద్ద నుండు'' నని చెప్పి కుమారుని దోడ్కొని చనెను.

## —॥ యౌవరాజ్యాభిషేకము. ॥—

తన కుమారునకు గంగాదేవి దేవవ్రతుఁడని పేరుఁ బెట్టెను. ఆతఁడు పరశురామునియొద్ద సమస్త శస్త్రాస్త్ర విద్యల నభ్యసించెను. ఒకనాఁడు దేవవ్రతుఁడు గంగాతీరస్థ సైకత ప్రదేశమున శరలాఘవము - కరలాఘవమునుఁ జూచుకొనుచుండెను. ఆసమయమున నచ్చటికి శంతనుఁడు వచ్చి యా కుమారుని దివ్యతేజమున కద్భుతమందుచు నట్టె నిలిచి యుండెను. అప్పుడు గంగ యరుదెంచి కుమారుని చేయిఁబట్టుకొని శంతనునికడకుదీసికొనివచ్చి "నీకుఁదనయుఁడగు వీనిం దోడ్కొనిపొ''మ్మని చెప్పియొప్పగించెను. శంతనుఁ

దపరిమితానందము నందుచుఁ గుమారుని దోడ్కొని నిజ పురమునకువచ్చి ,యొకశుభ దినమున నాతనికి యౌవరాజ్యాభి షేకము గావించెను.

## — బ్రహ్మ చర్య వ్రత ము —

యౌవరాజ్యాభిషిక్తుఁడయిన దేవవ్రతుండు తన ధర్మవర్తనము చేఁబ్రజలవినుతికి బాత్రుఁడగుచుండెను. తనపుత్రుని సద్గుణములకు శంతనుఁడెంతయో సంతసించుచుండెను. ఈవిధమునఁ గొన్ని సంవత్సరములు గడిచెను. ఒకనాఁడు శంతనుఁడు యమునా తీరమునకుఁ బోయి యచ్చట నోడనడుపుచున్న యొకకన్యనువిలోకించి, దానిసౌందర్యమున కచ్చెరువు బొంది, సమీపించి యామెవృత్తాంత మడిగెను. అందులకామె యిట్లుప్రత్యుత్తరమిచ్చెను. 'నేనుదాశరాజునకుఁ బుత్రికను. నన్ను సత్యవతియందురు. ధర్మార్థ మీయమునపై నోడనడుపుచుందును." శంతనుఁ డాపలుకులవిని, యామెను బరిణయం బాడఁ దలఁచి దాశరాజుం జేరి యాతనిచేఁ బూజితుఁడై తన యభీష్టముఁ దెలిపెను. అందులకు దాశరాజు తన సమ్మతిని జూపెను. కాని యొక్క యాటంకము మాత్రము పెట్టెను: మత్స్యగంధియందు జనించిన కుమారుని రాజుగాఁ జేసినచో నామెను శంతనునకిచ్చి వివాహము సేయుదునని చెప్పెను. గంగయందు జన్మించి యువరాజైనయున్న భీష్ముని దలఁచి శంతనుఁడు దాశరాజునకేమియుఁ బ్రత్యుత్తర మీయఁజాలక నిజపురమునకు మరలిపోయెను.

శంతనుఁ డిల్లుఁ జేరెనను మాటయేగాని, యాతఁడు నిద్రాహారములకు దూరుఁడయ్యెను. మత్స్యగంధిపై నున్న మోహముచే నాతఁడు నానాటికిశుష్కించుచుండెను. తండ్రి విధము గాంగేయుఁడు చూచి, యాతనిం జేరి నెమ్మదిగా నిట్లు పలికెను. "జనకా! నీవు వేటనుండి వచ్చిన నాటనుండియు రాజకార్యములయందు వర్తించుచుండుట లేదు. నీవెందులకో దీర్ఘచింతాపరుఁడవైయున్న విధము నాకుఁబొడకట్టుచున్నది. రాజ్యమంతయు సకలవిధ సస్యాభివృద్ధిం బొందుచున్నది. ప్రజలెల్లరు సుఖముగా నున్నారు. మనకు శాత్రవబాధ యావంతయు లేదు. అట్టిచో నీపరితాపమునకుఁ గారణ మేమి?" కొడుకు పలుకులకుఁ దండ్రి యిట్లనెను. 'కుమారా! ఏక పుత్రవంతుఁడును పుత్రులు లేనివాడును నొక్కటియేయని పెద్దలు చెప్పుదురు. ఇదియుంగాక నీవు మహాబలపరాక్రమ శౌర్య విరాజితుఁడవు. యుద్ధప్రియుఁడవు. నేను నీజీవితమునకు నమ్మఁజాలక యున్నాను కావున నాకొకకన్యను వివాహమాడవలయునను కోరిక గలిగినది.'

తండ్రిమాటలువిని, గాంగేయుఁడు నెమ్మదిగా తండ్రి యొద్దనుండు నాప్తులవలన నాతనిచిత్తము సత్యవతి (మత్స్యగంధి—యోజనగంధి) పైజిక్కియుండుట గ్రహించెను. అనంతరము భీష్ముఁడు దాశరాజుకడకేగి, సత్యవతిని దన తండ్రికిచ్చి పెండ్లిసేయుమని కోరెను. దాశరాజు గాంగేయుని విలోకించి, "యువరాజా! నీవు పరమ పావనమూర్తివి. సకల ధర్మార్థవిదుఁడవు. తండ్రికొఱకు కన్యక నడుగవచ్చితివి. నేను సంతోషించితిని. మీతో బాంధవ్యమునందుటకన్న నాకుమఱి

యొక భాగ్యమేమియును లేదు," అని శంతనమహారాజుతోఁ జెప్పినమాటలనే మరలఁ జెప్పెను, ఆమాటలు విని పితృభక్తిపరాయణుఁడగు దేవవ్రతుఁడు దాశరాజుంగాంచి "దాశరాజా! నీవిందులకై సంశయింపవలదు. శంతనునకు సత్యవతియందు జనియించు నందనుఁడే రాజుకాఁగలఁడు. ఆతఁడే కులవిస్తారకుఁడగు" నని పలికెను. దాశరాజందులకు సంతోషించి యాతనికి మరల నిట్లనెను. "నీవు ధర్మవ్రతాచారపారీణుఁడవగుటచేత, నట్లు పలికితివి. నీకున్న బుద్ధి నీకుమారులకుండునా! వారు నీధర్మము ననుసరింతురా?" గాంగేయుఁడామాటలువిని యచ్చటివారెల్లరు వినుచుండ దాశరాజును విలోకించి, "గుర్వర్థము నేను వివాహమును మానుకొనుచున్నాను." అని శపథముజేసెను. ఆహా! భీష్ముని పితృభక్తి వర్ణనాతీతముకదా! తండ్రికొఱకు రాజ్యము వలదనుటయే గాక, యాజన్మాంతము బ్రహ్మచారినై యుందునని ప్రతిజ్ఞ జేసెను. గాంగేయుని ప్రతిజ్ఞకు బృందారకులు సంతసించి యాతనికి భీష్ముండని పేరుబెట్టిరి. నాటినుండియు నాతఁడు భీష్ముఁడని పిలువఁ బడుచుండెను. భీష్ముఁడీవిధమునఁ బ్రతిజ్ఞజేయుటచేత, దాశరాజు సత్యవతినిచ్చి శంతనునకు వివాహము జేసెను. శంతనుఁడు భీష్ముని పితృభక్తికి సంతసించి యాతనికి స్వచ్ఛందమరణము వరముగానిచ్చెను.

## గురుధిక్కారము

శంతనునకు సత్యవతియందుఁ జిత్రాంగద, విచిత్రవీర్యులను నిరువురు కుమారు లుదయించిరి. వీరికి యుక్తవ

యస్సు రాకపూర్వమే తండ్రిమృతినందెను. భీష్ముఁడు చిత్రాం గదుని రాజుగాఁజేసెను. కాని యతఁడొక గంధర్వునిచే వధిం పఁబడెను. తరువాత విచిత్రవీర్యుని రాజుగాఁజేసి, భీష్ముఁడు రాజ్యరక్షణముఁ జేయుచుండెను. కొన్నాళ్ళకు భీష్ముఁడు వారణాసి కేగి,యచ్చట రాజమందిరమునకుస్వయంవరమునకు వచ్చిన రాజుల నెల్లరఁ దృణీకరించి, కాశీరాజ పుత్రికలగు అంబ, అంబిక, అంబాలికలను ముగ్వురనురథముపై నెక్కించు కొనివచ్చుచుండెను. ఆతనిందాకి పెక్కుమందిరాజులోడిపోయి నిజపురములకు మఱలిపోయిరి. ఇట్లు ముగ్వురు కన్యకలతో భీష్ముఁడు నిజనగరము జేరి, వారలను విచిత్రవీర్యునకిచ్చి వివా హాముసేయఁదలంచియుండఁగానందు అంబతానదివఱకే సాల్వ రాజును వరించియుంటినని భీష్మునితోఁ జెప్పెను. అంతట భీష్ముఁడామెను గౌరవముగా భూసురులనుఁదోడిచ్చి సాల్వ రాజుకడకుఁ బంపి, యంబి కాంబాలికలను విచిత్రవీర్యున కొసంగి మహావైభవముతోఁ బెండ్లిఁ జేసెను.

తనకడకరుదెంచినయంబనుజూచిసాల్వుఁడు 'భీష్ముఁడు నిన్ను రథముపైఁ బెట్టుకొని తెచ్చినాఁడు. అన్యునిచే స్పృశింపబడిన నిన్ను నేను గ్రహింప"నని నిరాకరించెను. అప్పుడామెమరల భీష్మునికడకువచ్చి సాల్వునిమాట నెఱిం గించి, తన్ను విచిత్రవీర్యునకిచ్చి పెండ్లిసేయుమనికోరెను. "అన్యాసక్త హృదయవగునిన్ను నాతమ్మునకిచ్చివివాహము సేయ''నని భీష్ముఁడామెకు గట్టిగాఁ జెప్పెను. అంతట నంబ తనకు మార్గమేమియుఁ దోచక తిన్నగా పరశురాముని యొద్దకుఁబోయి యావృత్తాంతమంతయు నెఱిగించి, తన్ను

రక్షింపుమని వేడికొనెను. పరశురాముఁడు గాంగేయుని రావించి, యంబను విచిత్రవీర్యునకిచ్చి పెండ్లిసేయుమని చెప్పెను. ఎన్నివిధములఁ జెప్పినను భీష్ముఁ డందుల కంగీకరింపలేదు. ఈ విషయమున నా గురుశిష్యులకు ఘోరయుద్ధము జరిగెను. పెక్కుదినములు యుద్ధమయిన పిదపఁ బరశురాముఁడు, శిష్యునిఁజూచి, "గాంగేయా! నీ ధర్మసంధత కెంతయు మెచ్చితి' నని శ్లాఘించి, పిదప-నంబతో "కుమారీ! భీష్ముఁ డధర్మకార్యము సేయఁడు. నేను చేయవలసినపని జేసితిని. ఇక నేచేయునది లేదు. నీ యిచ్ఛవచ్చినయట్లు పొమ్ము' అని పలికెను. అంబ పరశురామునకు నమస్కరించి తన కిట్టి స్థితి వచ్చుటకుఁ గారణము భీష్ముఁడు కావునఁ దపమునన్నైన నాతని సాధింతునని యెంచి, యరిగెను.

## —: ప్రతిజ్ఞానిర్వహణము. :—

విచిత్రవీర్యుఁడు సంతానము వడయకుండనే మరణించెను. వంశము నిలచుటకు మార్గమేమియు లేదయ్యెను. అప్పుడు సత్యవతి ఘోరసముద్రమునఁగూలి, భీష్మునితో వివాహముఁ జేసికొని కురువంశము నిలువఁబెట్టుమని పలికెను భీష్ముం డందులకు సమ్మతింపలేదు. ఆతఁ డామెకు భక్తిపూర్వకముగ నమస్కరించి, "నేనొనర్చిన ప్రతిజ్ఞకు భంగము గలిగించితినేని జగంబులు నవ్వవా! సూర్యుఁడు వేడిమిని, చంద్రుఁడు చల్లదనమును, విడిచినను నేనుమాత్రము నా శపథమునకు వ్యతిరేకముగాఁ బ్రవర్తింపను." అని పలికెను. అంతట సత్యవతి తన ప్రథమపుత్రుఁడగు వ్యాసునిఁ దలంచి

నంతనే, యతఁడరుదెంచి, నమస్కరించి, తన్ను రావించు టకుఁ, గారణము జెప్పుమని కోరెను. ఆమె తన పుత్రుల మరణ మెఱింగించి, విచిత్రవీర్యుని భార్యలందు ధర్మవిధినిఁ బుత్రోత్పత్తిఁ గావింపుమనెను.

వ్యాసుని కృపవలన విచిత్రవీర్యుని భార్యలగు నంబి కకు ధృతరాష్ట్రుఁడును-అంబాలికకుఁ బాండురాజును జనిం చిరి. అంబిక దాసికిగూడ విదురుఁడను వాఁడొకఁడు పుట్టెను. ధృతరాష్ట్రునకు యుక్తవయస్సు రాగానే భీష్ముఁడాతనిని రాజుగాఁజేసెను. పాండురాజు యువరాజయ్యెను. అనంత రము భీష్ముఁడు ధృతరాష్ట్రునకు గాంధారినిఁ, బాండురాజు నకుఁ గుంతి మాద్రిలను వివాహముఁ జేసెను. ధృతరాష్ట్రుని పుత్రులే కౌరవు లనంబడిరి. పాండురాజునకు ధర్మ భీమా ర్జున నకుల సహదేవులను నేవురు పుత్రు లుదయించిరి.

## —:0 యుద్ధము. 0:—

పాండురాజు మరణానంతరముధృతరాష్ట్రుఁడే యాతని కుమారులను బెంచెను. కురుకుమారులను, పాండవులును ద్రోణాచార్యునియొద్ద శస్త్రాస్త్రవిద్యల నభ్యసించిరి. పాం డవులు ధర్మబుద్ధి గలవారగుటచే పౌరజుల వినుతికిఁ బాత్రుల గుచుండిరి. ఇయ్యది కౌరవుల కసూయఁగలిగించెను. కౌర వులు పాండవుల కనేకకష్టములఁ గూర్చిరి. తుదకు గౌరవా గ్రేజుఁడగుదుర్యోధనుఁడొక మాయాద్యూతమునుగల్పించి, పాండవుల రాజ్యశ్రీల హరించుటయేగాక, నిండుసభయందు బాండవ ధర్మపత్నియగు ద్రౌపది కట్టు పుట్టము లొలిచి

పరిభవించిరి. ఈ సందర్భమునఁ బాండవులు పండ్రెండేండ్లు వనవాసమును, నొక్కయేఁ డజ్ఞాత వాసమునుఁ జేసివచ్చి తమ రాజభాగము దమకిమ్మనియడుగుటకుఁ గృష్ణునిరాయబారిగా బంపిరి. కృష్ణుఁడు చెప్పవలసిన మాటలన్నియు ధృతరాష్ట్ర దుర్యోధనులతోఁ జెప్పెను. కానిసంధిపొసఁగలేదు. అందు చేతఁ గౌరవులకును, బాండవులకును కలహము వాటిల్లెను. భీష్మునకుఁ గౌరవ పాండవులయందు సమానమైన ప్రేమయే యుండెను. కాని పాండవులు ధర్మసంధులగుటచే వారియందు త్సల్యమెక్కువ. యుద్ధమునకు ముందు, దుర్యోధనుఁడు భీష్ముని దండనాయకుఁడుగా నుండుమనికోరెను. అప్పుడతం డిట్లు చెప్పెను. "కుమారా! నీవుకోరినట్లు నేను సర్వసైన్యా ధిపత్యము వహించెదను. యుద్ధమున నేనెవ్వరికిని భయమం దనుగానియర్జునునిమాత్ర మెదిరింపఁజాలను. అస్త్రవిద్యయం దాతఁడు నాకన్న మేటి. ఎందఱినైనను దునుమాడుదును గాని పాండవులఁదునుముటకు మాత్రము నాచేయియాడదు. ఇఁక నొకసంగతి చెప్పవలసియున్నది. తొల్లి నాచేతఁ బరా భవింపఁబడిన యంబ శిఖండియై ద్రుపదునకుఁదనయుఁడుగా జన్మించెను. నేనాతనితో రణమొనర్పను. అతఁడు శరప్ర యోగముఁ జేసినను నేనెదురు ప్రయోగింపను."

తరువాత యుద్ధమారంభమయినది. సర్వసైన్యాధి పతియై భీష్ముడు యుద్ధరంగమున నవతరించి తనయోధులఁ గాంచి యిట్లుపలికెను. "వీరులారా! క్షత్రియులకు యుద్ధమే క్రీడాప్రదేశము. అదియే తెరువఁబడియున్న స్వర్గద్వారము.

తొల్లి మనపూర్వులందఱును యుద్ధములఁ జేసియె సత్కీర్తి నార్జించియున్నారు. మీరును వారిమార్గమున ననుసరింపుడు."

...ఁడు పదిదినములు యుదము జేసెను. ఈసమయములోఁ బాండవ బలములు మిగుల దీనదశకువచ్చెను. రెండుసారులు అర్జునునకుఁ బౌరుషము గలిగించుటకు, భీష్ముని జంపుదునని పలుకుచుఁ గృష్ణుఁడు రథమునుండి నేలకు లంఘించి చక్రహస్తుఁడైన మురారిం జూచి భీష్ముఁడు చేతులు జోడించుకొని యిట్లు పలికెను. "నందనందనా! ముకుందా! ధర్మసంరక్షణార్థమై నీవు పాండవుల పక్షముననిలిచియుంటివి. నిన్నెదిరించువాఁడీ మూఁడు లోకములయందును లేడు. భీష్మునిఁ జంపెదనని నీవు పలికినంతమాత్రమున నేను భయమందను. నీచేఁ జచ్చుటకన్న నాకు నుఱియొక పుణ్యమేమియు లేదు. కృష్ణా! రమ్ము. నీచక్రమున నాశిరము దునిమి ముక్తి దయసేయుము." ఆమాటలకుఁ గృష్ణుఁడు మాటలాడ లేక పోయెను. మొత్తముమీఁద భీష్ముఁడొనర్చిన పదిదినముల యుద్ధములో బాండవులు జయమనుమాట నెఱుఁగరు. పాండవబలములో బెక్కండ్రు యోధులు మడియుచుండిరి. ఇట్లుండ నొకనాటి రాత్రి ధర్మరాజు భీష్మునిసన్నిధికి రహస్యముగాఁబోయి నమస్కరించి నిలుచుండెను. భీష్ముఁడాతని కుశల ప్రశ్నములడిగి యర్ధనిశియందుఁ వచ్చుటకుఁ గారణమేమని యడిగెను. అందులకు ధర్మరాజు తనముఖంబున దైన్యముఁదోప "తాతా! మా సైన్యములు చావకయుండువిధమును, మాకు రాజ్యములభించు

మార్గమును జెప్పుము.'' అని పలికెను. "నేను యుద్ధము సేయుచున్నంతవఱకు మీకు జయము కలుగ"దని గాంగే యుఁడు బదులు చెప్పెను. ధర్మరాజు భీష్మునితో నిట్లు మరలఁ బలికెను. "పితామహా! శూలపాణియగు రుద్రుని విధమున నీవు రణభూమిం బ్రవేశించి, యోధులఁ దునుమా డుచున్న నిన్నెవ్వఁడు వారింపగలఁడు. నీయనుగ్రహము బడ యుఁదలంచి వచ్చిన నాకు నిన్ను గెలుచు విధము జెప్పి రక్షింపు' మని యడుగుచుఁ బాదములపైఁ బడెను. నిష్క ల్మషచరితుఁడును, ధర్మపక్షపాతియునగు భీష్ముఁడు ధర్మ రాజున కిట్లుఁ జెప్పెను. "ధర్మనందనా! నిశ్చయముగా రణం బున నన్నెవ్వరును గెలువఁజాలరు. నీవిట్లు నన్నుఁ బ్రార్థిం చుచుండుటం జేసి, ధర్మసంధుండవయిన నీ కుపకారముసే యక తప్పదు. నేను పడమింబడినఁగాని మీరు విజయలక్ష్మి లాలితులుకారు. నేను శిరముల ధరింపనివానితోడను, అంగ నాపూర్వునితోడను, అంగనాభిధానునితోడను రణంబొన ర్పను. కావున మీరు నన్నుఁ గూల్చుట కొక యుపాయము చెప్పెదను. ద్రుపదుని పుత్రుఁడయిన శిఖండిని బురస్కరిం చుకొని అర్జునుఁడు నన్ను గెలువవచ్చును.'

ఆహా! భీష్ముడెట్టి స్వార్థత్యాగి! ధర్మపరులగు పాండ వులకు జయము గూర్పఁదలంచి తన ప్రాణములు విడుచు టకుఁ గూడ సిద్ధమయ్యెనుగదా! భీష్ముని సెలవుబొంది ధర్మ రాజు శిబిరమునకుఁ బోయి యా వృత్తాంతము వాసుదేవున కును దన తమ్ములకును నెఱింగించెను. భీష్మునిఁ జంపవలసి

వచ్చినందుల కర్జునుఁ డెంతయో విచారించెను. తుదకాతండు శిఖండిని బురస్కరించుకొని, భీష్మునిఁదాకి నేలఁ గూల్చెను ఆ లోకక్షైక వీరుఁడగు భీష్ముఁడు నేలఁబడక శరములూతగాఁ జేసికొని పడియుండెను. భీష్ముఁడు పడినయంతనే యుభయ పక్షముల వారును యుద్ధమునాపి యాతనిం జేరిరి. భీష్ముని యాజ్ఞ ననుసరించి యర్జునుం డాతని యంపశయ్యకుం దూపులతోఁ దలగడఁ జేసెను. అంతట భీష్ముఁ డచ్చటనున్న వారిం జూచి "నేను ఉత్తరాయణము వచ్చువఱకు నీశరశయ్యయందే యుందును. అంతవఱకు నన్ను రక్షింపుచుండు" డనిపలికెను. భీష్మరక్షణమునం దనేకులుకురుపాండవుల చేనియమింపఁబడిరి.

గాంగేయునకుఁ గృష్ణునియం దతి భక్తి కలదు. అంప శయ్యనున్న యీతఁడు నిర్యాణ దినమున కెదురుచూచుచు వాసుదేవ పరబ్రహ్మమును మనంబున సేవించు చుండెను. ఈతఁడు కృష్ణుని యాజ్ఞ ననుసరించి ధర్మరాజున కనేక ధర్మము లుపదేశించెను. తరువాత ఉత్తరాయణము వచ్చినయంతనే, యాతఁడు ధర్మరాజాదులకును దక్కినవారికినిఁ జెప్పవలసిన మాటలఁ జెప్పి, మాఘశుద్ధ యేకాదశీదినమున బ్రహ్మరంధ్రమునుండి ప్రాణములు విడిచి దివ్యపదమునందెను. భీష్ముఁడు స్వర్గము జేరినదినము "భీష్మ యేకాదశీ" యను పేర పరమపవిత్రదినముగ భారతీయులచే నెంచబడుచున్నది.

# 6 ప్రహ్లాదుఁడు.

(దైవభక్తి.)

మానవునకు ముఖ్యముగా నుండవలసినది భగవద్భక్తి. దేనికయినను చలనమున్నది కాని భక్తికిమాత్రము చలనము లేదు. దానికి దఱుగు విఱుగు లేదు. ప్రహ్లాదునిభక్తి నిరుపమానమయినది. నిష్కళంకమైనది. నిశ్చలమయినది. సాధారణముగ లోకమునందుఁ బ్రతికవియు నీపరమపావనుని నిర్మల చరిత్రమును వ్రాయుచుండును. ప్రతిభక్తుఁడునుగూడనీభక్తాగ్రగణ్యుని గాథఁ బాడుచు మహానందవార్ధి నోలలాడుచుండును.

శ్రీహరి మందిరపాలకులయిన జయవిజయులు సనకసనందనాదుల శాపకారణమున భూమియందు దితికి హిరణ్యకశిప హిరణ్యాక్షులను దానవులై జన్మించిరి. ఇందుహిరణ్యాక్షుఁడు వరాహరూపుఁడగు శ్రీహరిచేఁ జంపఁబడెను. తమ్మునిమృతి విని హిరణ్యకశిపుఁడు మిగుల వగచి, హరినిసాధింపఁదలఁచి మంత్రులను విలోకించి యిట్లు పలికెను. "మంత్రులారా! నా తమ్ముని శ్రీహరి సూకరరూపమున వధించినాఁడు. అట్టి వానిఁబట్టి వధించినఁగాని నేను నిద్రాహారము లొల్లను. మీరు నేను చెప్పినయట్లు ప్రవర్తింపుఁడు. ఏప్రదేశమున క్రతువులు మొదలగు సత్కార్యములు జరుగుచుండునో యెచ్చట దానము - ధర్మము - తపము నుండునో, యెచ్చట వర్ణాశ్రమధర్మములు తప్పక జరుగుచుండునో యచ్చట శ్రీహరియుండును. కావున మీరట్టి ప్రదేశములనుధ్వంసము జేయుఁడు." దానవులు హిరణ్యకశిపుని యాజ్ఞననుసరించిరి.

తరువాత హిరణ్యకశిపుఁడు బ్రహ్మవలనన భేద్యములగు వరములఁ బడయఁదలఁచి, తపమునకై మందరాచలమున కరిగెను. రాక్షసేంద్రుఁడు నగరంబున లేఁడనువార్తవిని మహేంద్రుఁడాతని నగరముపై దండెత్తివచ్చి యాతని భార్యయగు లీలావతినిఁ జెఱఁగొని పోవుచుండెను. అప్పుడామె బహుభంగుల విలపించుచు నింద్రునిఁజూచి "మహేంద్రా! నా నాథుఁడు లేనిసమయమున నీనగరుజొచ్చి నన్ను బంధించుకొని పోవుట నీకుధర్మమా! నీవు స్వర్గలోకాధిపతివి. పుణ్యచరిత్రుఁడవు. సమస్తధర్మముల నెఱింగినవాఁడవు. కరుణించి నన్ను విడువు" మని దీనముఖిపలికెను. ఇంద్రుఁడామె మాటలను వినక కొనిపోవుచుండెను. ఆమె రోదన మంతకంతకు హెచ్చుచుండెను. ఆసమయమున నామె కడ్డపడు వారెవ్వరును లేరయిరి. అప్పుడామె యార్తనాదము నారదమునీంద్రుం డెఱింగి, కడురయమున వచ్చియింద్రునివిలోకించి "మహేంద్రా! ఇట్టి సాహసకార్యము సేయుచుంటివేమి? ఈమె రాక్షసేంద్రుని భార్య యయినను మిగుల సుశీలమురాలు. మహాపతివ్రత. ఇఁకవిడువు" మనిపలికెను. ఆమాటలకు దేవేంద్రుఁడు మునీంద్రా! "నేనీమెను నేవిధమైనదురుద్దేశముచేతను గొనిపోవుట లేదు. ఈమె మహా సాధ్వియని నేనెఱుంగుదును - ఈమె హిరణ్యకశిపుని భార్య - అతఁడు లోకకంటకుఁడను విషయము మీరెఱుంగుదురుకదా! ఈమె గర్భమున నొక బాలుఁడున్నాఁడు. ఈతఁ డెట్టిక్రూరుఁడగునో - ఈమెను నాపురమునకుఁ గొనిపోయి, ప్రసూతియగువఱకును వేచియుండి, జనించు శిశువును దునిమి, పిదప నీమెను విడిచెద -" నని చెప్పెను. ఆపలు

కులకు నారదుం డిట్లు చెప్పెను. "శచీకళత్రా! ఈమెగర్భ మున నున్న బాలుఁడు పరమ భాగవతోత్తముఁ డగును. ఆతని మూలమున పదునాలుగు భువనములకు సౌఖ్యము కలుగును. ఆతఁడు నీచేత మడియువాఁడు కాడు. కావున నీమెను విడువుము.''

నారదుని మాటలు విని యింద్రుఁడు లీలావతిని విడిచిపెట్టి నిజలోకమునకుఁ బోయెను. మహా విపత్సముద్రము నుండి తన్నుద్ధరించినందులకు లీలావతి నారదునకు మ్రొక్కి యనేక విధముల సన్నుతించెను - హిరణ్యకశిపుఁడు తపస్సు నుండి వచ్చువఱకును దన యాశ్రమమున నుండుమని చెప్పి, నారదుఁడు లీలావతిని దోడ్కొని పోయెను. ఆతఁడు తన యాశ్రమమున నామె సంరక్షణమునకుఁ దాపసకన్యల నియోగించి యామెకు సద్బోధ గావించుచుండెను. లీలావతియు నాతనియందు భక్తిగలిగి శుశ్రూషలు సేయుచుండెను. కొన్నాళ్ళకా లీలావతికొక కుమారుఁడు జనించెను. నారదుఁడా బాలునకుఁ బ్రహ్లాదుఁడని నామకరణము జేసెను.

అచ్చట హిరణ్యకశిపుఁడు బ్రహ్మనుఁ బ్రసన్నుని జేసికొని యనేక వరములఁగాంచి పురమునకు మరలివచ్చెను. ఆతఁడువచ్చిన జాడ నెఱింగి, నారదుఁడు పుత్రసహితయగు లీలావతిని దోడ్కొనిపోయి, యొప్పగించెను. నారదుఁడు తన యందట్టి కరుణఁ జూపినందులకు, దానవేంద్రుఁ డతనిని మిగుల ప్రశంసించెను.

బ్రహ్మవరమున గర్వించిన హిరణ్యకశిపుఁడు సకల లోకములనుహింసింపఁ దొడఁగెను. ఆతఁడుపెట్టు బాధలకుఁ

దాళఁజాలక దేవతలు శ్రీహరి సన్నిధి కేగి మొరవెట్టుకొనిరి. శ్రీమన్నారాయణుఁడు వారింజూచి "దేవతలారా! మీరు చింతింపవలదు. నేనును వానింజంపుటకుఁ దగిన సమయము కొఱకు నిరీక్షించుచుంటిని. సాధువులను, గోవులను, బ్రాహ్మణులను బాధించు వాఁడెప్పుడును వృద్ధిఁబొందఁడు. తనపుత్రుఁడయిన ప్రహ్లాదుని వాఁడెప్పుడు బాధించునో యప్పుడే వానిని సంహరింతును. భయంబుదక్కి మీమీ నెలవుల కేగుఁడు' అని పలికెను. దేవతలా దేవాదిదేవునకు నమస్కరించి చనిరి.

ప్రహ్లాదుఁడతి గారాబమునఁ దల్లిదండ్రులచేఁ బెంపఁబడుచు నైదేండ్ల బాలుఁడయ్యెను. అతని చర్యలన్నియు నత్యద్భుతముగ నుండెను. పిన్నవాఁడయ్యును, బెద్దలఁ జూచిన యంతనే భృత్యునివలె నమస్కరించును. పరస్త్రీలను దల్లులవలె భావించును. నిరంతరము హరిభజనయందే చిత్తము నిలిపియుంచును. శ్రీహరిసేవయే ముఖ్యమని నమ్మెను. ఈ లోకమంతయు విష్ణుమయమని తలంచును. అతఁడహర్నిశలు శ్రీహరి సేవతప్ప నన్యచింత నెఱుఁగఁడు. ఒకప్పుడు వెఱ్ఱివానివలె గంతులువేయును. ఒకసమయమున జడుని విధమున నూరకుండును. ఒకప్పుడు హరికీర్తనలఁ బాడును. మఱియొకప్పుడు తనలోఁదానె సంభాషించుకొనును.

ఈ విధమంతయు హిరణ్యకశిపుఁడు చూచి, "ఈ కుమారుఁడు కేవలము వెఱ్ఱివానివలెఁ దోచుచున్నాఁడు. వీనికి విద్యగఱపినఁగాని బుద్ధిరాదు.' అని తలంచి కుమారుని గాంచి 'నాయనా! విద్యలేనివాఁడు మూఢుఁడగును. విద్యవలన జ్ఞానముకలుగును. కావున విద్య నేర్చుకొను' మని చెప్పి

గురువులగు చండామార్కుల రావించి, ప్రహ్లాదునకు విద్యఁ గఱపుఁడని చెప్పి యొప్పగించెను. చండామార్కులు ప్రహ్లాదుని దోడ్కొనిపోయి క్రమక్రమముగా నాతనిచే ననేక శాస్త్రములు పఠింపఁజేసిరి. కాని వారు చెప్పుచదువు మంచిదికాదనిగాని, చదువననిగాని చెప్పలేదు. తన హరిభక్తి మాత్రము మానలేదు. ఆతనిచే హరిగుణకీర్తనము మానిపింపవలయునని, చండామార్కు లెంతయో ప్రయత్నించిరి. కొంచెమయినను లాభము కనబడదయ్యెను. ప్రహ్లాదుఁడు తాను భక్తుఁడై యుండుటయేగాక, తోడిబాలురకుఁగూడ హరిభక్తి నుపదేశించెను. వారందఱును నాతని మార్గమనుసరించిరి. ఇట్లుండ నొకనాఁడు హిరణ్యకశిపుఁడు కుమారుని రావించి ముద్దాడి, తొడపైఁగూర్చుండఁబెట్టుకొని, యతఁడు చదివిన విద్యలలో నేదియుత్తమమనినో చెప్పఁగానిఁ జేర్గొనుమని యడిగెను! అందులకుఁ బ్రహ్లాదుఁడు తండ్రికి నమస్కరించి యిట్లుచెప్పెను, "తండ్రీ! సంసారమను చీకటినూతిలో మునుగక- నేను- నాది- మీరు- మీది యనుభేరము లేక- ప్రపంచమంతయు విష్ణుమయమని తలంచుటయే మంచిదని నేను గ్రహించితిని." ప్రహ్లాదుని మాటలకుఁ దండ్రియలిగి- "శ్రీహరి మనకు విరోధియనియు, నీపినతండ్రిని వధించినాఁడనియు, నాతనిస్మరింప రాద"నియుఁబలికెను. ప్రపంచములోఁ దనకు విష్ణువుతప్ప మఱియెవ్వరును గనిపించుటలేదని ప్రహ్లాదుఁడు బదులు చెప్పెను. అచ్చటనేయున్న చండామార్కులాకుమారుని జూచి "ప్రహ్లాదా! ఇన్నిదినములనుండియు మేముచెప్పిన చదువంతయు నేలపాలుఁజేసి, మాకుఁ

దలవంపులు తెచ్చితివి" యని పలికి, మరల రాక్షసేంద్రునిఁ జూచి యిట్లనిరి. "నీకుమారునకు మేము దుర్బోధ సేయు వారముకాము. ఈబుద్ధి యాతనికి జనించినదేకాని యొరులు చెప్పినదికాదు. నీకీతఁడుశత్రుఁడుగానిపుత్రుఁడుకాఁడు. శిక్షా పాత్రుఁడుగాని రక్షాపాత్రుఁడుకాఁడు-" తరువాత హిరణ్యకశి పుఁడుప్రహ్లాదుని మరలగురువులకొప్పగించెను. గురువులాతని మరల ననేకవిధములగు శాస్త్రములు బోధించిరి. కొన్నాళ్లు జరిగినపిదప వారాతనినొకనాఁడు తల్లియగు లీలావతికడకుఁ దోడ్కొనిపోయిరి. లీలావతికుమారునిబుజ్జగించి "నాయనా! నీతండ్రికి విరోధియైన హరిని స్మరింపవల"దనిచెప్పెను. తరు వాత వారాతనిని హిరణ్యకశిపునియొద్దకుఁ గొనిపోయిరి. హిరణ్యకశిపుఁడు కుమారునిఁ జేరఁదీసి యతఁడు చదివిన శాస్త్రములో నొకపద్యముజదివి దాని తాత్పర్యముఁ జెప్పు మని యడిగెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు హరిసేవఁగూర్చి యిట్లు పలికెను.

"సీ॥ కమలాక్షు నర్చించు ♦ కరములు కరములు
శ్రీనాథు వర్ణించు ♦ జిహ్వ జిహ్వ
సురరక్షకునిఁజూచు ♦ చూడ్కులు చూడ్కులు
శేషశాయికి మ్రొక్కు ♦ శిరము శిరము
విష్ణునాకర్ణించు ♦ వీనులు వీనులు
మధువైరిఁ దవిలిన ♦ మనము మనము
భగవంతువలగొను ♦ పదములు పదములు
పురుషోత్తమునిమీఁది ♦ బుద్ధి బుద్ధి

తే॥ దేవదేవునిఁ జింతించు దినము దినము
చక్రిహస్తునిఁ బ్రకటించు చదువు చదువు
కుంభినీధవుఁ జెప్పెడి గురుఁడు గురుఁడు
తండ్రి! హరిఁ జేరుమనియెడి తండ్రి తండ్రి."

ఈ మాటలకు హిరణ్యకశిపుని హృదయమునఁ గోపాగ్ని ప్రజ్వరిల్లెను. చండామార్కులే కుమారునకిట్టి దుర్బోధఁ గావించి రని యతఁడు వారిని దూషించెను. తామేపాపము నెఱుంగ మని వారు చెప్పిరి. అంతట హిరణ్యకశిపుఁడు కుమారుని హరిభక్తి విడువుమని చెప్పెను. అందులకా కుమారుఁడు సమ్మతింపలేదు_దానవేంద్రుఁడు దండతాడితమహోరగము కరణి మండిపడుచు – దైత్యభటులకా కుమారుని శిక్షించుట కాజ్ఞ నిచ్చెను. రాక్షసభటులు ప్రహ్లాదునిగొనిపోయి హరిభక్తి విడిచెదవా లేదా యని పలుకుచు - శూలములచేఁ బొడిచిరి - అగ్నిం దోసిరి - జలమునఁ బడవేసిరి - సర్పములచేఁ గఱపించిరి. ఎన్ని చేసినను నాతఁడు హరిచింతనము మానలేదు. తన్ను రక్షింపుమని తల్లిని వేడలేదు - రాక్షసులు శిక్షించుచుండఁగా భయమున బాఱలేదు - ఆతని శరీర మావంతయుఁ గందలేదు. భగవంతుఁడగు హరికరుణవలన నాతఁడెట్టియపాయమును బొందక యధిక తేజముతోఁ బ్రకాశించుచుండెను. తుదకు రాక్షసభటులు విసిగి, యాతనిని తండ్రికడకుఁ గొనిపోయి యావృత్తాంతము నెఱిఁగించిరి. ఆమాటలు విని హిరణ్యకశిపుఁడు తనమనంబున, "ఆహా! ఈకుమారుని మహిమ యత్యద్భుతముగ నున్నది. భటులెంత శిక్షించినను నొక్కింతయు నొవ్వక యున్నాఁడు- ఈతని కేయౌషధములును తెలి

యవు. మంత్రములురావు. వీని నిట్టి యాపదలనుండి యెవ్వరు రక్షించుచున్నారు. ఈతనివలన నాకు మరణము సంభవించును కాబోలు"నని చింతింపఁ గడంగెను. అట్టి సమయమున చండామార్కులువచ్చి యాతని విచార కారణ మెఱింగి, "దైత్యేంద్రా! నీవు చింతింపవలదు. మాతండ్రియగు శుక్రాచార్యుఁడు త్వరలో వచ్చును. ఆతఁడు వీనిని నీతికుశలునిగాఁ జేయఁ గలఁడు. అంతవఱకును మేమీాతనికి గృహస్థాశ్రమ ధర్మముల నెఱింగించుచుందు''మని చెప్పి ప్రహ్లాదునిదోడ్కొని పోయి, యెన్నియో గృహస్థాశ్రమ ధర్మములఁ జెప్పిరి. కేవలము విరాగియై, హరిభక్తి తప్ప, నన్యమెఱుంగని యాతని చిత్తమైహికసుఖంబుల కాసపడునా? ప్రహ్లాదుని మూలమున తోడిబాలురుగూడ తమపుస్తకముల నావలఁ బాఱవేసి హరి భక్తులైరి. ఇఁక ప్రహ్లాదుఁడు తమకువశ్యుఁడుగాడని భావించి, వెంటనేయాతనిందోడ్కొని దైత్యేంద్రునిసన్నిధికిఁబోయి యా విషయము నెఱింగించిరి. అంతటహిరణ్యకశిపుఁడు కుమారుని జూచి, " ఓరీ ! తులువా ! నాయాజ్ఞలేక యినుం డెండం గాయ వెఱచును- వాయువు సంచరింపదు- అగ్ని వెలుఁగదు- యముఁడు ప్రాణులఁజంపఁడు. అట్టిచోనీవుబాలుఁడవయ్యును నాయాజ్ఞఁ దప్పుచుంటివేల? ఓరీ! పితృద్రోహీ! హరిని మించిన వాఁడీజగంబులలేడని వచించుచుంటివి. నిన్నిప్పుడేచంపి నా కులము నిష్కళంకముఁ జేసెదను. నేను సమస్త లోకముల జయించితిని. దేవతలందఱును నన్నుదిక్కని నమ్మియున్నారు. నీ పినతండ్రిని వధించిన యాహరిం జంపవలయునని నేను ప్రపంచమంతయు నన్వేషించితిని. ఎక్కడను గనుపింప

లేదు. నీ వెవ్వని దిక్కునమ్మి నన్నుఁదిరస్కరించుచున్నావు" అని కన్నులనగ్నికణంబులు రాల్చుచుఁ, బండ్లుపటపటగొఱుకుచు నడిగిన తండ్రింజూచి - ప్రహ్లాదుఁడు ముకుళితకరకమలుఁడై యిట్లనెను. "తండ్రీ! బలము గలవారికిని, బలహీనులకును, పిపీలికాది బ్రహ్మపర్యంతమును గల సకల జీవములకును, నీకును, నాకును గూడ నాధారమెవ్వఁడో యట్టి వాఁడే నాకు దిక్కగును - నాయనా! ఒక్కమాట వినుము. నీవు సకలలోకములను జయించితినని పలికితివి. కాని ప్రయోజనమేమియును లేదు. ఇంద్రియానీకమును మనస్సును మాత్రము జయింపలేక పోయితివి. నీవు వానిని జయించితివేని, లోకములో నీకు శత్రువులే యుండరు. కావున నా విన్నపమాలకించి యహంకారము విడిచి హరియందుఁ జిత్తము జేర్పుము." ఆమాటలకు హిరణ్యకశిపుఁడు కోపారుణిత నేత్రుఁడై "ఓరీ! నీవు మృత్యువునకుఁ దెగించి యిట్లు పేలుచుంటివి. నాకంటె లోకమున దైవ మెవఁడు గలఁడు. నీవు శ్రీహరిని బహువిధములఁ బ్రస్తుతించుచుంటివి. వానింజూపుము. వానిని నిన్నునుగూడఁ జంపుదును." అని తన చేతనున్న ఖడ్గమును పైకెత్తెను.

అప్పుడు ప్రహ్లాదుఁడు మనంబున హరికి నమస్కరించి, తండ్రిం గాంచి, "శ్రీహరి ప్రపంచమునం దెల్లెడ నిండి యున్నాఁడు."

క॥ ఇందుఁగలఁ డందులేఁడని
సందేహము వలదు చక్రి సర్వోపగతుం

డెందెందు వెదకి చూచిన
నందందే కలఁడు దానవాగ్రణి వింటే.

మ॥ కలఁడంభోధిఁ గలండు గాలి గలఁ డాకాశంబునం గుంభినిం
గలఁడగ్నిన్ దిశలన్ బగళ్ళ నిశలన్ ఖద్యోత చంద్రాదులం
గలఁ డోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులందంతటం
గలఁ డీశుండు గలండు తండ్రి వెదకంగా నేల నీయాయెడన్.

ప్రహ్లాదుని నోటినుండి యిట్టినుడులు వెలువడఁగనే తన్నచ్చటఁ జూపింపుమని హిరణ్యకశిపుఁ డడుగునో యని యా శ్రీహరి నరసింహరూపమున జగమునం దెల్లెడ నిండి యుండెను. ప్రహ్లాదుని పలుకులు విని 'ఓరీ! నీకు మృత్యువు సమీపించినది. నీవు శ్రీహరి సభాస్తంభంబునఁ జూపుము. అట్లు చూపవేని నీశిరము ఖండించెద'ననెను. అందులకుఁ బ్రహ్లాదుఁడు 'తండ్రీ! యెల్లెడనున్న శ్రీహరి స్తంభమున మాత్ర మేల లేకుండును. ఆతఁడు లేని తావే లే'దని చెప్పెను.

అంతట నాకనకకశ్యపుఁడు కోపారుణిత లోచనుండై "యోరీ! శ్రీహరి యెక్కడ! అతనిని, నిన్నుగూడ నీయాయుధముచే ముక్కలు ముక్కలు చేతు"ననుచు తన ఖడ్గముచే నాస్తంభమును మోదెను. వెంటనే స్తంభమునుండి శ్రీహరి మనుష్యుఁడును మృగముకాని, నరసింహరూపమున బయలు వెడలి, దివారాత్రములు రెండునుగాని సంధ్యాసమయమున, లోపల వెలుపలగాని సభాద్వారమున నభస్థలమును, భూతలమునుగాని యూరుమధ్యమునఁ, బ్రాణములుకలవియు లేనివియునగు నఖంబుల నాహిరణ్యకశిపుని హృదయము జీల్చి,

పేరిపులు పుష్పమాలికలుగఁ గంఠమున ధరించెను. అప్పుడు దేవతలు ప్రసూన వృష్టిఁగురిపించిరి. నరసింహమూర్తి ప్రహ్లాదుని రక్షించి, యనేక వరములిచ్చి నిజలోకమున కేగెను.



## 7 హంసకాకీయోపాఖ్యానము.

సాగర మధ్యముననొక్క ద్వీపము కలదు. అందు ధర్మవర్తియుఁ బుణ్యమార్గవర్తనుఁడును, సదాచారసంపన్నుఁడును- శాంత హృదయుఁడును- దయామయుఁడును నగు నొక వైశ్యుఁడు గలఁడు. అతఁ డనేక పుత్త్రులు కలిగియుండి ధనవంతుఁడై విరాజిల్లుచుండెను. ఇట్లుండ నొకదినమున నొక వాయసం బాతని గృహముఁ జేరఁ గాంచి, యాతనిపుత్రులు దానికి నెంగిళులు పెట్టుచు బోషించుచు వచ్చిరి. అక్కాకియు వైశ్య గృహంబున నెంగిళులం దినుచుఁ గ్రొవ్వుబట్టి, తన కీడయిన పక్షి లేదని దర్పించి చరించు చుండెను.

ఇట్లుండ నొకదినమున హంసలు కొన్ని సముద్ర తీరమునకు వచ్చుటఁ జూచి, వైశ్యపుత్త్రులాకాశమునకువానిం జూపి, "కాకమా! నీవు పక్షులం దెక్కుడు దానవని చరించుచుందువు. ఆహంసలను దిలకించితివా? ఇయ్యవి వినువీధిని మిగుల వడిగఁ బోవును- నీవు వీనితోఁ బందెమువేసి గెలువవలయు" నని పలికిరి. తారతమ్యజ్ఞానములేని యా వైశ్యకుమారుల మాటల కొడలుప్పొంగ, నది యెంతమాత్రపు కార్యమనిపలికి, యాహంసలఁ జేరి, యందుఁ దన కిచ్చ

వచ్చిన హంసమునుఁ జేరి, తనతోఁ బఱచుటకు రమ్మని పిలిచెను- అంతనయ్యంచలు వాయసము పలుకులకు నవ్వి "వాయసమా! మేము నిరంతరమును మానస సరోవరంబున విహరించు చుందుము- ప్రతిస్థలంబునఁ జరింతుము ఎంత దూరముపోవలసి వచ్చినను నాయాస మందము. అట్టిచో మాయందఱిలో మిగుల జవసత్వములు గలహంసను నీతోఁ బందెమునకుఁ బిలిచితివి- మున్నెప్పుడును హంసలతోఁ బందెము వేసిన వాయసమును మేమెచ్చటనుఁ జూడలేదు-" అని పలికెను. ఆమాటలకు వాయస మిట్లు పలికెను. నడకల యందు శతవిధము లున్నవి- అవి వక్రయానము- వలయ క్రమము - మొదలగు నామములతో నొప్పుచుండును. అందొక్కొక్క నడకమీద శతయోజన పర్యంతము నేనరుగఁ గలను- మీరందఱును జూచుచుండ నేనీయంచతోఁ బఱచి గెలిచెదఁగాక!"

ఈవాక్యములు కాకముచేఁ బిలువఁదగిన మరాళం బాలించి "నీవు శతవిధములుఁ బరచెదనని వచియించితివి- నేను వాని నెఱుంగను- ఆకసమునఁ బక్షులన్నియు నేవిధమునఁ బాఱునో యట్లే సముద్రముననను నాకాశముననుఁ బాఱుదము. రమ్ము." అనెను. ఆమాటల కచ్చటనున్న కాకుల లన్నియుఁ బరిహాసించిమరాళమునుగాంచి "ఈకాకమునూఱు గతులఁ బాఱును. ఒకటే నడక నేర్చిన నీవు దీనితో నెట్లు నడువగలవు. దీనిచే నీవు భంగమందెద"వని పలికెను.

మరాళ మవ్వాక్యంబులు సఱకు గొనక వాయసముతోఁ బఱచుటకుఁ గడంగెను- ఇట్లు రెండును జలధిపై

నాకసం బంటునట్లు పఱచు నవసరమున, రాయంచ నెమ్మ దిగాఁ బోవుచుండెను - వాయస మతి తీవ్రముగ నాయా సమందుచుఁబోవుచుండెను. ఉచ్ఛిష్టదర్పితయగు కాకంబనేక తెఱంగులఁ బోవుచు వెనుకనున్న మరాళము దగ్గఱకు వచ్చుచుఁ బిలచుచుఁ ముక్కును ముక్కుమీఁద మోపుచు, మరల ముందునకుఁ బోవుచు మురియుచుండెను.

కాకము పఱచుటఁ జూచి, తక్కిన వాయసములు - కా, కా, యని సంతోషమునఁ బెద్దపెట్టున నఱచుచు మరాళము భంగపడునని పలుకుచుండెను. కాకముల కల కలము మరాళము విని, యుత్సాహభరితమై, మిగుల పొడ వున కెగసి యతి రయమునఁ బఱవఁ దొడంగెను- కడు రయ మున నడచుటయందుఁ బ్రావీణ్యముగల రాయంచను గలిసి కొనుటకుమిగుల ప్రయత్నించి, పఱుగిడఁజాలక, యక్కాకము తనచిత్తమున "అక్కటా! ముందు వెనుక లరయక దీనితోఁ బఱచుటకు సిద్ధపడితిని. నిలచుటకైన నెక్కడను వృక్ష ములు లేవు. ఇది యంతయు జలమయమై యున్నది. దిగితి నేని మరణము నిశ్చయము." అని చింతించుచు - భయము నందియున్న, యక్కాకమును వీక్షించి మరాళము "వాయ సమా! నీవనేకగతుల నడకలునేర్చితి నంటివి. ఇది యేగతి. నావెంటఁ ద్వరగా రమ్ము." అని గేలిసేయుచుఁ బఱచు చుండెను - వాయస మొక్క యడుగయిన వేయజాలక బలంబంతయుఁ గోల్పోయి, బెగడొంది యుండెను. మరా ళము వాయసమునుఁజూచి "ఎవ్వరికైననుఁ జెప్పినట్లు జేయుట కష " మనెను. అప్పుడు దీనమానసమైయున్న వాయ

సము, రాయంచం జూచి యిట్లు పలికెను. "మరాళమా!
వైశ్యపుత్రులు పెట్టిన యుచ్ఛిష్టమును దిని దర్పించి గర్వమునఁ
జరించితిని. ఇప్పటికి నాబలము నాకుఁ దెలిసినది. నాయప
రాధము మన్నించి దయగల నీ చూపులు నాపైఁ బఱపి,
రక్షించి నన్ను మరల గాకులలోఁ గలుపుము." అని పలు
కుచు - కా కా యని యఱచుచుఁ సముద్రమునఁ బడనున్న
యక్కాకమును మరాళము గృపఁబూని దానిని తన చరణ
ములసందున నిఱికించుకొని మరణ భయము వాపి, తీరము
నకుఁ జేర్చి విడిచి, తక్కినకాకులన్నియు వినుచుండ నవ్వాయ
సముతో "ఎదిరిబలమును నీబలము నెఱుంగకుండ నెన్నఁడు
నిట్టి యకార్యము సేయకు"మని చెప్పెను.



# 8 సావిత్రి—సత్యవంతుఁడు

అశ్వపతియను నామంబున నొప్పు నృపాలుఁడొకఁడు
మద్రదేశమునుఁబరిపాలించుచుండెను. అతఁడు సంతానార్థియై
సావిత్రింగూర్చి తపముసేయ నద్దేవి ప్రత్యక్షమైయొకకూతుం
బ్రసాదించి, యాతఁడు కుమారునికై తన్నుఁ గొల్చుట
యెఱింగి, యానృపాలుని జూచి "నీకుఁ గూతురువలన శత
పుత్రిలాభముకలుగు"నని చెప్పియంతర్ధానమయ్యెను. కొన్నా
ళ్ళకు సావిత్రి వరమున నశ్వపతికి (మాళవియను ధర్మపత్ని
యందు) నొకపుత్రిక కలుగ, నాశిసువునకు సావిత్రి యను
పేరు పెట్టిరి. సావిత్రి దినదిన ప్రవర్ధమానయై సౌందర్యము

నందు సురసిద్ధసాధ్యవిద్యాధర కన్యల హసించుచు,సంప్రాప్త యౌవనయై యుండుటఁ జూచి, యామెను దగిన వరునకీయ నశ్వపతి తలంచియుండెను. ఒకసమయమున నారదుండుమద్ర మహీశ్వరుని కడ కరుదెంచి సత్యవంతుని గుణములఁ గూర్చి చెప్పగా విని, నాటినుండియు సావిత్రి తనమనంబు నాతనిపై నిలిపియుంచెను. కాని సిగ్గుచే నెవ్వరికినిఁ దెలుపకయుండెను.

ఇట్లుండ మఱియొకనాఁడు నారదమునీంద్రుఁడు మద్రే శ్వరుని కడ కరుదెంచి యాతనిచేఁ బూజలంది సుఖాసీనుఁడై యిష్టాగోష్ఠినున్న సమయమున, నశ్వపతి యాజ్ఞపై నచ్చుటకు సావిత్రిగూడవచ్చెను. నారదుఁడురాజేంద్రునిజూచి, "నృపాలా! యుక్తవయస్కురాలైయున్న యీామె కింకను వివాహ మేల సేయక యుంటి" వని యడిగెను. అశ్వపతి కుమారిం జూచి "అమ్మాయీ! నీకు వివాహకాలము సమీపించినది. నీ గుణరూపవృత్తములకుఁ దగినపతిని నీవే పేర్కొనుము" అని పలుక నయ్యువిద యెక్కింతలజ్జించి, తండ్రితోఁ "నా చిత్తముసాల్వపతి తనయుఁడగు సత్యవంతునిపైఁజిక్కియున్నది. సాళ్వరా జిప్పుడంధుఁడై, రాజ్యముఁ గోలుపోయి, భార్యాపుత్రసహితముగ వనమునన్నాఁడు. ఎట్లయినను సత్యవంతునే వరించెద" నని నుడివెను. మద్రేశ్వరుఁడు నారదునిఁ జూచి సత్యవంతునిఁగూర్చి యడుగ నమ్మునీంద్రుఁ డిట్లనెను. "నృపాలా! సకలసుగుణములును, భుజబలపరాక్రమ ధైర్య సాహసములును నాతనియొద్ద మూర్తీభవించియున్నవి. కాని యొక విషయముమాత్రము నీతోఁ జెప్పక తప్పదయ్యెను. పెండ్లియైన యొక సంవత్సరమున కాతఁడు మరణించును."

నారదుని వాక్యములు వినఁగనే యశ్వపతి కేమియుఁ దోఁచక సావిత్రింజూచి, "తల్లీ! నారదుఁడు సత్యమువక్కాణించుచున్నాఁడు. సమస్తము నెఱింగియుండియు సత్యవంతునకు నిన్నెట్లీయఁగలను. మఱియొకని వరింపు మనెను. సావిత్రి యందులకు సమ్మతింపలేదు. ఆమెతండ్రిని విలోకించి "తండ్రీ! మనోవాక్కాయ కర్మలను మూడింటియందును, నంతఃకరణము ప్రధానము. మనంబునఁ గోరిన భర్తను విడచి, మఱియొకనిని వరించుట ధర్మముకాదు. ఆసత్యవంతుఁ డెట్టివాఁడైనను నేనాతనినేవరింతు"నని తననిశ్చయాభిప్రాయమునుఁ బ్రకటించెను. నారదుఁడును మద్రపతిఁజూచి "నృపాలా! గుణములప్రోవైన నీపుత్రిక చిత్తమును మరల్చుటకు మనకు శక్యముకాదు. కావున సత్యవంతునకే యొసంగుము. ఈమె చేసిన పుణ్యములచేత నా సత్యవంతుఁడు దీర్ఘాయువునుఁ బొందుఁగాక"యని పలికి యరిగెను.

మద్రేశ్వరుఁడును నందులకు సమ్మతించి, సకల పురోహితామాత్య బృందములు వెంటరా సావిత్రిం దోడ్కొని సాల్వపతియగు ద్యుమత్సేనుఁడున్నయరణ్యమున కరిగి యాతనిచేఁ బూజితుఁడై తనకోరికఁ దెలిపి యాతనిని సమ్మతిఁ బఱచి యొక శుభలగ్నమున సావిత్రిని సత్యవంతున కొసంగి పరిణయము గావించి, యతఁడు నిజపురమున కరిగెను.

ఇట్లు సావిత్రి సత్యవంతుని వివాహమాడి భూషణాంబరముల నుజ్జగించి, వల్కలములఁ దాల్చి యత్తమామల చిత్తంబులు రంజిల్లునట్లు సేవలసేయుచు, భర్తింబూని పతిం గొలుచుచుండెను. నారదుని వాక్యముల ననుసరించి

యయ్యెంతి పరిణయంబైనది మొదలు భర్తయొక్కయాయుః ప్రమాణమనుదినమును లెక్కపెట్టుచుండెను. నాల్గుదినములు కొఱఁతగా సంవత్సరము నిండెను. అప్పుడీమె త్రిరాత్రోప వాస వ్రతముబూనెను. మూఁడుదినములు గడఁచెను. నాల్గవ దినమునఁ బతికి మరణము గలుగునని యెఱిఁగి, చింతించుచు, బరమేశ్వరుని ధ్యానించుచుండెను. ఆనాఁడు సత్యవంతుఁడు సమిత్కుశ ఫలార్థ మరణ్యమున కరుగనున్న సమయమున సావిత్రి యతనింజూచి "నాథా! నేనుగూడ నీవెంటఁ జనుదెంతును. తోడ్కొని పొ"మ్మని యడిగెను. సత్యవంతుఁడు "రమణీ! నీవు త్రిరాత్రోపవాస కారణమున మిగులఁ బడలి యున్నదానవు. నీవత్తమామలయొద్ద నుండుము. నేను సత్వరముగనే యరుదెంచెద" నని నుడివిన నందులకామె యిట్లనెను.

మ॥ ఉపవాసశ్రమమించుకంతయునునా♦యుల్లంబునందోపదీ
విపినం బుజ్జ్వల పుష్పపల్లవ ఫలా♦విర్భూతినానా లతా
గపరీతంబనవిందుఁజూడఁగ మదిం♦గౌతూహలంబయ్యె న
న్నుపరోధింపకు మింతవట్టుచనవీ♦యుక్తుండ వెబ్భంగులన్.

సావిత్రి రాకకు సత్యవంతుఁడు సమ్మతించెను. అత్తమామలయాజ్ఞఁబొంది యాతరుణీమణి నాథునివెంట నరణ్యమునకరిగెను. సత్యవంతుఁడు ఫలములను పుష్పములనుగోసి, యొక యెండిన చెట్టుంజేరి, గొడ్డలిచే దాని కొమ్మలఁ జీల్చుచుఁ గొంతసేపటికి మిగుల శ్రమనంది - గొడ్డలి నేలఁబడ వైచి-వాడిన మోముగలవాఁడై యత్తలోదరింగాంచి "ఇంతీ! నాశరీరము నావశంబగుట లేదు - నాశిరముపై శూలములచేఁ

డిచినట్లుండె. ఒక్క నిమిషమయినను నిలువఁజాల. శ్రీమ
య నొక్కింతకాలము శయనించెద-'' నని పలుక - నా
విత్రి తన యంకతలము నాతని కుపధానముగాఁ జేయ -
తఁడు దానిపై వ్రాలి నిశ్చేతనుండై యుండెను- అంతఁ
ంతసేపటికిఁ గాటుకవంటిశరీరమును, ఘోరమై వాడిగల
ష్ట్రిలును, రక్తచ్ఛాయఁగల కన్నులును, లోకములఁ గం
పఁజేయు భయంకర రూపమును, గలిగి - పాశహస్తుఁడై
త్యవంతుం గదిసిన యొకపురుషుంగాంచిభయంబంది సావిత్రి
జేశుని శిరము నంకతలమునుండి నేలఁబెట్టి యాపురుషునకు
మస్కరించి "మహాత్మా! మీరెవ్వరు? ఎందులకై యిచ్చోట
తెంచితి'' రని యడిగెను. అప్పురుషుఁడా సతీమణిం
ంచి "తరుణీమణీ! నేను కాలుఁడను. నీ పాతివ్రత్య మహి
ం జేసి నీవు నన్నుఁ గాంచఁగలిగితివి. అన్యులకు నే నగోచ
ఁడ. నీపతికిఁ గాలము సమీపించినది. ఈతఁడు పుణ్య
మూర్తియగుటచేత నితరులను బంపక నేనే యీతనిఁ గొని
వ వచ్చితి''నని పలికి సత్యవంతుని దేహముననున్న జీవుని
డలఁజేసి దీర్ఘపాశబద్ధుంజేసి దక్షిణాభిముఖుఁడై పోవుచుం
ను. అంత సావిత్రి శోకమునందుచుఁ బ్రాణేశ్వరుని దేహ
ముక్కయెడ సంగుప్తంబు గావించి, యముని వెంటఁ బోవఁ
ాడంగెను. యముఁడు తన వెంట వచ్చుచున్న సావిత్రింజూచి
కమలాక్షీ! నీవేల నా వెంటవచ్చెదవు. ఇఁకముందున్న మార్గ
ంగమ్యము. నిలువు''మనెను. ఆమె "దేవా! పతులెచ్చట
న్న సతులుగూడ నచ్చటనుండుట ధర్మము. నీకరుణచేతను
ా పతిభక్తిచేతను నేనరుగలేని స్థలములుండునే? ధర్మ

మార్గమున కాలవాలమయిన సజ్జన దర్శనము వృధయగునా నీదర్శనమున నేను శుభముల నందక మరలిపోవుదునా?" యని వచించెను. కాలుఁడామెవాక్యములకు సంతసించి విభునిజీవితము తప్ప, మఱియొక వరముఁ గోరుకొనుమని యామెకుఁ జెప్పెను. శత్రువులచే రాజ్యముఁ గోల్పోవఁబడి యంధుఁడై యరణ్యమున నున్న తనమామయగు సాల్వపతికి, కన్నులు వచ్చునట్లు వరంబిమ్మని సావిత్రికోర, యముండట్లనుగ్రహించి యామెను మరలిపొమ్మని చెప్పి చనుచుండెను. సావిత్రి యాతని వెంటఁబడి "వాఙ్మనఃక్రియల నెవ్వరికిని హింస సేయకుండుటయు, దీనులను గృపతోడఁ బోషించుటయు, నర్థులయభీష్టముల దీర్చుచుండుటయు, నార్యధర్మములై యుండును. నీవెఱుంగని పరమ ధర్మము లెందును లేవు. ధర్మస్వరూపుఁడ వగుటచేత నిన్ను ధర్మదేవతయనిరి. అఖిలజీవశ్రేణియొక్క కర్మఫలములను సమబుద్ధింజూచువాఁడగుటచేత సమవర్తివైతివి. భూతములను నియమించువాఁడ వగుటఁజేసి యముండవనియుఁ, బాపశమనము సేయువాఁడ వగుటఁజేసి, శమనుండవనియుఁ బేరు లందినాఁడవు.'

శమనుఁడామె మృదుమధుర భాషణములకు సంతసించి, విభుని ప్రాణముదక్క మఱియొక వరముఁ గోరుకొనుమని చెప్ప, నాకాంత వైరులచేనపహరింపఁబడిన తనమామగారి రాజ్యము మరల వచ్చునట్లనుగ్రహింపుమని కోరెను. ధర్మదేవతయగు యముఁ డావరమిచ్చి "ఇంక నీవు మరలుమని చెప్పెను. కాని యామె యతనిని విడువక వెంటబోవుచుండ నాతఁడు మరల సత్యవంతుని జీవములుదప్ప నొండువ

రము గోరుకొనుమనెను. తనతండ్రికి శతపుత్రలాభము కలుగునట్లు వరంబిమ్మని సావిత్రికోర దానింగూడ యముఁడను గ్రహించి చనుచుండెను. సావిత్రి యాతని వెంటనంటెను. ఆతఁడామెను చూచి 'నీవు కడుదూరమరుదెంచి మిగుల డస్సితివి. ఇఁక మరలు'మనెను అందులకు సావిత్రి "దేవా! నాకాయాస మనునది యెక్కడనున్నది. పతిని విడచిపోవుటకు నాచిత్తము సమ్మతించునా? ఏడుమాటల నాడినచో నెట్టివారును జుట్టములగుదురని పెద్దలుచెప్పుదురు. ఆకారణమున, నింతదూరము నీవెంటవచ్చిన నేను నీకుఁ జుట్టమనైతినని వేఱుగఁ జెప్పవలయునా? అట్టిచో బంధుజనమనోరథము దీర్చుటనీకవశ్యకర్తవ్యమైయున్నది. యని వినయపూర్వకముగ విన్నవించెను. ఆమె తన్ను వెంబడించుటమానదని యముఁడు పూర్తిగ గ్రహించి "సావిత్రీ! నీవు భర్తృసేవాపరతంత్రవని నేనెఱుంగుదును. మృతుండైన నీభర్తమరల సంప్రాప్తింపఁడు. మంచివారైనను, జెడ్డవారైనను గాలమాసన్నమైనంతనే మృత్యుగహ్వరమునఁ బ్రవేశింపక తప్పదు. ఆచంద్రార్క తారావనీ శరథిస్థాయిగ బ్రదుకువా రెవ్వరునులేరు పొమ్మ' అని గట్టిగాఁ భయముఁ గొల్పుచుఁ బలికెను. ఆతని పలుకులకు సావిత్రి భయమందలేదు. ఆమె ధైర్యమునుఁ బూని యతని కిట్లుపలికెను. 'పితృపతీ! సమస్తశుభములకును నాలవాలమైన పతిసేవను విడిచి భూతలమున నేనేగతి జీవింపఁగలను? పతిలేనిసతిబ్రదుకు వ్యర్థముకదా! ఆర్తరక్షణము నీయందమరియున్నది. కాని, యేకారణముచేతనో నాయందింతవఱకును గృపవహింపకయున్నావు. అబలనగు

నేనింత దూరము వచ్చితినని కరుణవహించియైనఁ బతిభిక్షఁ బెట్టుము. ఇంతగా వేఁడుచున్న నాకు "నీవు భర్తను మరలఁ బడయఁజాల"వని వచించుట నీకు ధర్మమా! ఎంత నిర్దాక్షిణ్య చిత్తుఁడవు? విరించి నీహృదయమును గఠిన పాషాణతుల్యముగఁ జేసెనా? సాధ్వియనియుఁ బతిప్రాణ సంరక్షణార్థమింత దూరము వచ్చెననియైనఁ దలంపవేల? నేను నాపతిని గాంచఁజాలనా? నాపతి మరల రాఁడా? నాకుఁ బతియే లేఁడా! వైవస్వతా! సమస్తాభీష్టప్రదమును, సకల పాపశోషణమును, సౌఖ్యశ్రీల కాలవాలమును, సత్కీర్తిదాయకమును, ముక్తి మార్గమును నగు పతిసేవయే నాకు లేకుండునా? నాకుఁబతియే లేకుండనుండి, సాధ్వినగు నేనట్టి దుఃఖమునుఁబొందితినని, యీలోకములుండునా? సూర్యచంద్రాదులుందురా! ఈలోకముండునా! నీ పరిపాలనముండునా! నీవుందువా! సకలలోకములు నంధకారమయమై యుండవా! ఒక్కపెట్టున జగత్ప్రళయము సంభవింపదా?"

ఈ తెఱంగున వచించిన సావిత్రి వాక్యముల కాతఁడద్భుతమునంది, యామెనుఁజూచి "రమణీ! నీపలుకులు నాకుమోదముఁ గలిగించినవి. నీవింకొక వరము గోరుకొనుమని సత్యవంతుని జీవములుదప్ప-యనుమాట విడిచి చెప్పెను. అప్పుడు సావిత్రి యపరిమితానందమునుబొంది-

"చ॥ పతివిరహంబు దుస్సహము♦భర్తృవినాకృతయైనకాంత
దూషితయగుసర్వమంగళవి♦శేషములందునుగానమత్ప్రియుం
 డతులితకీర్తిశాలి సుగు♦ణాఢ్యుఁడు సాళ్వసుతుండు లబ్ధజీ
 వితుఁడుగ నిమ్ము ధర్మపథ ♦ వీపరిరక్షణ పుణ్యవీక్షణా."

అని యడిగెను. శమనుండామెకోరినట్లు సత్యవంతుని లబ్ధజీవితుని నొనర్చి చనెను. సావిత్రియుఁబరమ సంతోషము నందుచు సత్యవంతుఁడు పడియున్న స్థలమునకు వచ్చుసరికి నాతఁడంతకు మున్నే లేచి యామె నరయుచుండెను. సావిత్రి జరిగిన దంతయుఁ బ్రాణేశ్వరున కెఱింగించెను. ఇరువురును దమ యాశ్రమమునకుఁ జనిరి. ద్యుమత్సేనుఁడు లబ్ధచక్షుఁ డయి సావిత్రీ సత్యవంతులు రాలేదని చింతించుచుండెను. అంతలో సావిత్రీసహితుఁడై సత్యవంతుఁ డాతనిఁజేరి కన్నుల పండువఁ జేసెను. అనఁతరము వైరులు గెల్చిన రాజ్యమును మరల ద్యుమత్సేనుఁడు గాంచఁగలిగి, సకల పౌరులకును నానందమునుకలుగునట్లు సత్యవంతునిఁబట్టభద్రునిఁజేసెను.



# 9. భృగుఁడు.

భాగీరథీ పుణ్యవాహిని కనతి దూరము మహా పద్మమను నొక పురము కలదు. అందు భృగుఁడను నొక భూసురుఁడు వసించుచుండును. ఆతఁడు నిత్య ధర్మ నిరతుఁడు- సత్యవ్రతుఁడు- అహింసాపరుఁడు- నిష్కాపట్యుఁడు. ఆతఁడు న్యాయముగ నార్జించిన ధనముచే జీవయాత్రఁ గడుపుకొనుచు- నతిథిపూజలు శక్తియున్నంతవఱకు సేయుచుండును, ఆతనికిసద్గుణవంతులగు కొడుకులు గలరు - ఆతఁడు - నిరంతరము నెట్టి సత్కార్య మాచరించినచో ముక్తిలభించునో యట్టిమార్గము నన్వేషించు చుండును-ఇట్లుండ నాతనిగృహా

మున కొకనాఁ డొక భూసురుఁ డతిథియై వచ్చెను - భృగుఁ డా బ్రాహ్మణోత్తముని ననేకవిధంబుల గౌరవించి, "ధరామర వంశభూషణా! నేను సంసార సాగరమున మునింగి యుంటిని. ఎట్లు నేను ముక్తిఁబొంద గలుగుదు" నని యడిగెను. అందుం కా బ్రహ్మణుం డిట్లు పలికెను. "నేనును నీవలెనే సంసారి నార్థింబడి పరితపించుచుంటిని - మోక్షమున కనేక మార్గములున్నవి. కొందఱు బ్రహ్మచర్యమున నుండియుఁ, గొందఱు గృహస్థధర్మమున నుండియు- భగవంతుని సేవింతురు- కొందఱు తపముసేయుదురు - కొందఱు దాన ధర్మములనుఁ గ్రతువులనుఁ జేయుదురు. ఇట్లనేకు లనేకవిధంబుల మోక్షమునుఁ గాంచుచుందురు - కాని వీని కన్నిఁటికినిఁ బ్రధానమైనది యాత్మానందము - దానితో సమానమయినది మఱి యొకటిలేదు - కాని యది యలవడుట మాత్రము మిగుల కష్టము. కావున నేనొక విషయముఁ జెప్పెదను- నైమిశారణ్య సమీపమున గోమతి యను పుణ్యతీర్థముగలదు-దాని కనతిదూరమున మహా పద్మమను పుణ్య హ్రదము కలదు- అక్కడ పద్ముఁడను నొక సర్పరాజు కలఁడు. అతఁ డుదార చరిత్రుఁడను, ధర్మమూర్తియు, దయాపరుఁడును, నతిథి పూజారతుఁడునునై విలసిల్లుచుండును. నీ వాతని సన్నిధికిఁ బోయితివేని నీ సంశయములు వాయునని పలికెను - భృగుఁ డాతని వాక్యములకుసంతసించి, యాతనిని దనయింట నాల్గు దినము లతిథిగా నుండుమని కోరెను. భృగుని కోరిక ననుస

రించి యా బ్రాహ్మణుఁ డాతని గృహమున నాల్గు దినము లుండి యరిగెను.

తరువాత భృగుఁడు-బ్రాహ్మణుఁడు చెప్పినట్లు సర్ప రాజగు పద్మునిఁ జూడఁగోరి బయలుదేరి- మార్గమున ననేక పుణ్యక్షేత్రములు దర్శించుచు - దిన దిన ప్రయాణంబులు సేయుచు నైమిశారణ్యమునుఁ బ్రవేశించి, గోమతింగాంచి, మహాపద్మతటంబున నున్న పద్ముని దివ్యభవనమును విలో కించి నెమ్మదిగా నందుఁ బ్రవేశించెను. అంతటమందిరంబున నున్న పద్ముని భార్యవచ్చి, బ్రాహ్మణునకు నమస్కరించి, పూజించి సుఖాసీనుం జేసి, "బ్రాహ్మణోత్తమా! పుణ్యాత్ముఁడ వగు నీరాకచే నేను ధన్యురాల నయితిని. మా మందిరము పావనంబయ్యె. నీరాకకుఁ గారణమేమి?" యని యడిగెను. భృగుఁడు 'దేవీ! నీ ప్రాణేశ్వరుఁడగు పద్మునిఁ దిలకింపఁగోరి వచ్చితి'ననెను. పద్ముఁ డప్పు డచ్చట లేడు. సూర్యుని రథము నడపుటకై యరిగి యుండెను - ఎనిమిది దినములకుఁ గాని గృహమునకురాడు. భుజఁగేంద్రుని భార్య యాతని కా వృత్తాంతమెఱింగించి, యాతఁడు వచ్చువఱకును నతనిని దన మందిరమున నుండుమని కోరెను. భృగుఁ డచ్చటికి కనతి దూరమున నున్న వనంబున నుందుననియు, బద్ముఁడువచ్చిన యంతనే తన కెఱింగింపు మనియుఁ జెప్పి - సమీపవనంబు నకుఁ బోయెను.

భృగుం డా వనమును బ్రవేశించి నిరాహారుఁడై భుజగ నాథుని రాకకు వేచి యుండెను. అట్లు దినములు గడ

చెను. ఏడవ దినమున -పద్మని యాపు లాతని సన్నిధికిఁ బోయి "నీవు భుజించి నేటి కాఱు దినంబు లయ్యెను. మే మెప్పుడును నతిథులఁ బూజించు చుందుము. మా వ్రతము నకు భంగముగలిగింపక, మేమిచ్చు నాతిథ్యమును గ్రహిం పుము. నీవు కోరిన దానిని దెచ్చి యిచ్చెద"మని పలికిరి. అందులకు భృగుఁడు వారిని వీక్షించి 'నేను పద్మని రాకకై వేచియున్నాను. ఆతనిం జూచు వఱకు నేను జలము నైనఁ గోరిలను - మీకు ధర్మవిరోధము గాకుండ నీదినము గూడఁ జూడుఁడు. రే పాతఁడు రాకున్నచో భుజించెద"నని ప్రార్థ నా పూర్వకముగాఁ బలికెను. అందులకు వారు సమ్మతించి, మందిరమునకుఁ జనిరి.

ఆ మఱునాఁడు భుజఁగేంద్రుఁడు గృహామునకు వచ్చెను - ఆతని భార్యచేఁ బూజలంది, యొక్క-యెడ సుఖాసీనుఁడై యున్న యవసరమున నతఁడు భార్యంగాంచి "సతీమణీ! నీకు సేమమే కదా! దేవతాతిథిపూజలు జాగ్రత్తగా నడుపుచుం టివా?" యని ప్రశ్నించెను. అందుల కక్కాంత యిట్లు నుడివెను. 'దేవా! నీ శిక్షాతిశయమున నేను ప్రతివిషయము జాగరూకతతోఁ జూచుచుంటిని. అతిథులఁ బూజించుచుంటిని. గురుభక్తి శిష్యులకును, వేదపఠనము విప్రులకును, ప్రజాసంరక్ష ణము రాజులకును, న్యాయవిత్తార్జనము వైశ్యులకును, త్రివర్ణా రాధనము శూద్రులకును, ప్రభువాక్యపాలనము భటులకును' నెట్లు నియమింపఁ బడియున్నవో యట్లె పతివ్రతాత్వము భార్య కనుసరణీయమై యున్నది. నేను నిరంతరము ధర్మ

రతుఁడ వగు నీ చిత్తము ననుసరించి వర్తింతును గదా!" యని పలికి, మఱియు నిట్లనెను. "ప్రాణేశ్వరా! నేటి కెనిమిది దినముల క్రిందట మిమ్ముఁ జూచుటకొక భూసురుఁడువచ్చి నాచేఁ బూజింపఁబడినాఁడు. కార్యముమాత్రము చెప్పఁడయ్యె. నీరాకంగోరుచు నీసమీపవనమున నున్నాఁడు. నేటికాతఁడు భుజించి యేడుదినంబులయ్యెను. నీవు వచ్చువఱకు నాహారంబు గొననని దీక్ష నహించియున్నాఁడు. కావున నీవాతని సన్నిధికిఁబోయి సంభావింపవలయు"ను. భార్య పలుకులు విని యతఁడు కుపితుఁడై "నేనెక్కడ! ఆభూసురుఁడెక్కడ! నేనాతనిఁ గాంచఁ బోవలయునా? సురాసురులు నన్నేవిధంబున గౌరవింతురో నీవెఱుంగవా?" యని పలికెను. ఆ మాటలు విని యామె "నాథా! నీరాకఁగోరి నిరాహారుఁడై యున్న భూసురుని గౌరవింపకయుండుట నీకు ధర్మమా? ఆపాఱుని యాసఁ జెఱచి తత్పాపాగ్నిచే నీ పురుషార్థమును, ధర్మమును గాల్పఁ దలఁచితివా? నివా బ్రాహ్మణున కాశావిచ్ఛేదము గలిగించి, బ్రహ్మహత్యాపాతక మొడిఁగట్టుకొనఁదలంచితివా? కావున నామాటలు విని రోషముడిగి వానరాకఁగోరుచాతకము వడువున నీకై వేచియున్న యాభృగుని సంభావింపు"మనెను సతివాక్యములవిని కోపముడిగి పద్ముఁడు "తరుణీ! ఒరునిఁజూడఁ బొమ్మని పలికినయంతనే యాగ్రహము కలిగి యట్లంటిని. అంతటితో నీవూరకొనక నాకు ధర్మముఁ జెప్పి మహోపకారముఁ జేసితివి. రావణుఁడు మొదలగువారు కోపము

చేతనే మడసిరి. నీయట్టి భార్యయుండుటచేత దురితాపాయము నందకుండఁ దొలఁగితిని. ఇఁక నేనవ్విప్రుని కడకేగి యభీష్టముదీర్చివచ్చెద' నని పలికి యాక్షణమున నేపోయి, తన రాకకు వేచియున్న భృగునిజూచి, పూజించి, నిజ మందిరమునకుఁ దోడ్కొనివచ్చి, యతఁడడిగిన యర్థములకెల్ల దగునుత్తరము జెప్పి ప్రముదితాంత రంగునిఁజేసి పంపెను.

"క॥ అలయక యేండ్లు గడుం బె
క్కులు జీవించుట నర గలుగుటయుం దగు వృ
ద్ధుల లక్షణమే జ్ఞానము
గలఁడేనిన్ బాలుఁడయినఁ గడు వృద్ధుమహిన్.



## 10. అష్టావక్రుఁడు

తొల్లి యేకపాదుఁ డను నొక మునివరుఁడు కలఁడు. ఆతనికి సుజాత యను సతీరత్నము కలదు. ఏకపాదుఁడు తపోవనమున నిరంతరముఁ బరమేశ్వరునిఁ గొలుచుచు-దన కడ కరుదెంచు శిష్యులకుఁ బాఠములఁ జెప్పుచుండును. ఇట్లుండఁ గొన్నాళ్ళకు సుజాత గర్భిణియయ్యెను. ఒకనాఁడు ఏకపాదుడుఁ శిష్యులకుఁ బాఠములు సెప్పుచుండ, సుజాత గర్భమున నున్న యర్భకుఁడు తండ్రి నుద్దేశించి, "అహోరాత్రి లీగతి శిష్యులకుఁ బాఠములు జెప్పవలయునా? నిద్ర లేకున్నచో వారు జడమతులై పాఠములు తప్పఁజదువరా?' యని హేళనముగాఁ బలికెను. ఆపలుకుల కేకపాదుఁడాగ్ర

హామంది, "వేదాధ్యయనమునకు వ్యతిరేకముగాఁ బలికితివి. కావున నీ వెనిమిది వంకలు గల దేహముతో జన్మించెదవు గాక!"యని కొడుకునకు శాపమిచ్చెను. అగ్నికల్పుఁడైన యయ్యర్భకుఁడుఁ గడుపునఁ బెఱుగుచుండెను. ప్రసవకాలముఁ సమీపించుట యెఱిఁగి యాసుజాతభర్తనువిలోకించి, "పురుడు వచ్చునని యెఱింగి పేదవారుఁగూడ ఘృత తైల ధాన్యములు ముందుగనే సంగ్రహించి యుంచుకొందురు. మన మర్థవంతులము గాకపోవుటచే నవి యన్నియుఁ గఱవయ్యెను. ఏమిసేయుదము. నాకీ చింత యెట్లు బాయు" నని పలికెను. అంతట నేకపాదుఁడు ధనార్థియై జనక రాజు పాలికిఁ బోయెను. అప్పుడా నృపాలుఁ డొక మహా యజ్ఞమును సేయుచుండెను. అచ్చట నేకపాదుఁడు వరుణపుత్రుఁడయిన వందితో వివాదముఁ జేసి యోడి వివాదమునకుఁ బూర్వము చేసికొన్న శపథముల ననుసరించి జనముగ్నుఁ యుండెను.

అట సుజాత ప్రసూతియై యష్టావక్రుంగనెను. ఆసమయముననే యుద్దాలకుఁడను మునిభార్య శ్వేతకేతుండగు కుమారునిఁ గనెను. ఉద్దాలకుఁడు సుజాత కగ్రజుఁ డగును. అట్లు జన్మించిన యష్టావక్ర శ్వేతకేతు లిరువురును. సమవయస్కులై పెఱిగి, పండ్రెండేండ్ల ప్రాయము గలవారై, వేదాధ్యయనాది విద్యలందుఁ బ్రవీణులైరి. అష్టావక్రుఁడు వారి బాంధవ్య మెఱుంగక శ్వేతకేతుని భ్రాతగఁ దలంచి సుఖలీలనుండెను. ఒకనాఁ డష్టావక్రుఁ డుద్దాలకుని కుఱువె

క్కియుండెను. అప్పుడు శ్వేతకేతుఁ డచ్చటికివచ్చి యాకు మారునిఁజూచి "నీవేల మాతండ్రి కుఱువెక్కితివి. నీవు పోయి మీతండ్రియంకమెక్కు'మని చేయిఁబట్టి యీడ్చెను అందుల కష్టావక్రుఁడు విచారమందుచుఁ దల్లియగు సుజాత కడకుఁ బోయి, "అమ్మా! మాతండ్రి యెవఁడు? నాకుఁ గానుపింపఁడేమి? ఎందరిగె, తెలుపు'మనియడిగెను. సుజాత ఏకపాదుని వృత్తాంతముఁ గుమారున కెఱింగించెను.

అంతట నష్టావక్రుఁడు, శ్వేతకేతుని వెంటఁబెట్టుకొని మిథిలాపురమున కరిగి, జనకుని యజ్ఞమందిరము బ్రవేశింపఁ బోవగా నచ్చట దౌవారికులు వారింగాంచి "జనకమహా రాజు యజ్ఞసభఁ దీర్చియున్నాఁడు. అందు మహాయాజ్ఞికులు ను, వృద్ధ విద్వాంసులును, ప్రవేశింపవలయునుగాని, మీవం టిబాలురు ప్రవేశింపరాదు." అని పలికి వారించిరి. "జ్ఞానము గలవాఁడైనచో బాలుఁడయినను వృద్ధుఁడే. వేదాధ్యయన శీలుఁడగు బాలుఁడుగూడ సభాపూజ్యుండగును. కావున మమ్ము బాలురని తలంపవలదు. మేము జనకుని సందర్శించి యతని యనుమతిని సభయందున్న వేదవాదులను వాదం బున గెలువవచ్చితి'మని బదులుచెప్పెను. అప్పుడు ద్వార పాలకులు వారిని మందిరప్రవేశము సేయనిచ్చిరి. అష్టావ క్రుఁడు జనకుఁడడిగిన ప్రశ్నములకెల్ల నుత్తరమిచ్చి తనతం డ్రితో వాదించి గెలిచిన వరుణ పుత్రుఁడయిన వందితో వాదముఁ జేసి గెలిచి, జలమధ్యముననున్నతండ్రికి విముక్తిఁ గలిగించి, జనకరాజుచేఁ బూజలంది, యచ్చట నున్న ముని

లచేతను, భూసురులచేతను, వినుతింపఁబడి- తండ్రినిదోడ్కొని నిజాశ్రమమునకుఁ బోయెను.



## 11 యక్షుఁడు — ధర్మరాజు

పూర్వ మరణ్యావాస సమయమున ధర్మరాజు - తన నలువురు తమ్ములతో నొకనాడు వినోద సంభాషమునఁ బ్రొద్దుపుచ్చు నవసరమున నొక బ్రాహ్మణుఁడు వచ్చి "ధర్మనందనా! వృక్షశాఖకుఁ దగిల్చిన నాయరణి యొక లేడికొమ్మునకుఁ దగిలి దానియందుఁ జిక్కుకొనఁగా దానితోఁ గూడ నా హరిణముఁ బరుగెత్తెను. కావున నాయందుఁ గృపాంతరంగుఁడవై నిత్యవిధికి లోపము గలుగకుండ నామృగమునుఁ బట్టుకొని నాయరణి, దెచ్చిపెట్టు'మని యడిగెను.

అంతట ధర్మరాజు చాపహస్తుఁడై తమ్ములతో బయలుదేరి, త్వరితగమనమున నాహరిణమును వెంటాడించెను- ఆకురంగము పాండవులను గొంతదూరము తీసికొనిపోయి యదృశ్యమయ్యెను. తమ యత్నము నిష్ఫలమయినదని వారు విచారించుచు మార్గశ్రమమున డస్సి యుండుటచే నొక వటభూజముక్రింద విశ్రమించి యుండిరి. వారందఱును దాహపీడితులై యుండుటచే ధర్మనందనుఁడు నకులుని జూచి, "తమ్ముఁడా! నీవీ మహీరుహమెక్కి జల మేదెసనైన నున్నదేమోచూడు'మని చెప్పెను. నకులుఁడు వృక్షము నెక్కి దిక్కులుఁగలయఁజూచి, సరోవర మొండు కనిపించు చున్నదని

చెప్పెను. అట్లయిన నీవరిగి దాహముఁ దీర్చుకొని మాకుఁ గూడ
జలంబుల దెమ్మని ధర్మజుఁడు నలునకుఁ జెప్పి పంపెను.

నకులుఁడు సరోవరమున్న ప్రదేశమునకుం బోయి
నీరు ద్రావఁబోవ "ఓయీ! ఈ తటాకము నాయది-నీ విం
దలి జలంబులఁ గ్రోలనెంచితివేని నే నడుగు ప్రశ్నములకుత్త
రములిమ్ము" అను పలుకులాతనికి వినవచ్చెను. అతని కంటి
కెవ్వరును గనిపింపలేదు. ఆ పలుకుల గణింపక నకులుఁ డం
దలి నీరములఁ ద్రావి, నిశ్చేతనుఁడై తీరమునఁ బడియుండెను.
నకులుఁ డెంత సేపటికిని రాకపోవుటచే ధర్మజు డాతని జాడ
నఱయుటకు సహదేవునిఁ బంపెను. సహదేవుఁడరిగి తటాకతీర
మునఁ బడియున్న నకులుంగాంచి, యాతఁ డట్లు పడియుండుట
కేమి కారణమోయని తలంచుచు, దాహబాధ కోర్వఁజాలక
నీరములుఁ ద్రావంబోయెను. నకులునకు వినిపించిన మాటలే
యతనికి వినిపించెను. సహదేవుఁడుగూడ నా పలుకుల నిరాద
రించి, జలములఁ ద్రావి నకులుని చందమున నయ్యెను. వీరిరు
వురి నరయుటకు ధర్మరాజు పంపున నర్జునుఁడు పోయెను. ఆతఁ
డు తటాకతీరమున నున్న నకుల సహదేవులంగాంచి విస్మయ
మంది నలుదిక్కులఁ గలయఁజూచి, యెవ్వరినిఁ గానక సలిల
ములు గ్రోల సమకట్ట, "ఈ తటాకము నాయది. ఇందుఁ
దిగితివేని నీ ప్రాణము మీఁదకు వచ్చును. జలములఁ ద్రాగఁ
దలంతువేని నా ప్రశ్నముల కుత్తరము లిమ్ము" అను పూర్వ
వాక్యములు వినవచ్చెను. ఆ పలుకుల కర్జునుఁడు కొంచెము
క్రోధమువహించి, "నీ వెవ్వఁడవు? చాటుగనుండి యిట్లు పలి
కెదవు? ఇంతమాత్రమునకు నేను భయమందుదునని తలంచె

తివి కాఁబోలు- ఈయక్షుని ముందు నీమాటలుసాగవు" అని వచించి, సరోవరమునఁదిగి - జలములఁ ద్రావి తన తమ్ముల వలెనే ధరపై నొఱిగెను. తరువాత వీరి ముప్వురను నాయుటకు భీముఁడువచ్చి, పడియున్న తమ్ములఁజూచి విచారించి, దాహము దీర్చుకొనుటకు సలిలములు ద్రావఁబోవ, నెప్పటి మాటలే వినవచ్చెను. అతఁడుగూడ నప్పలుకులఁ గైకొనక నీరుద్రావి మూర్ఛనందెను.

అట్లు నలువురు తమ్ములు రాకఁ దడసిన కారణంబరయ లేక విచారించుచును, ధర్మజుఁడు వారినరయుచు సరోవరతీరమునకువచ్చి, యచేతనులై నేలఁబడియున్న తమ్ములనవలోకించి యంతరంగమున "ఇతరులెవ్వరును నిచ్చటకు వచ్చిపోయిన జాడ కనిపింపదయ్యెను. ఎవ్వరితోనైన వీరు యుద్ధము జేసిన జాడయు లేదు. వీరిట్లుపడియుండుటకుఁ గారణమేమైయుండును దుర్మార్గుఁడైన దుర్యోధనుఁ డేమాయనైనఁ బన్నెనేమో? వీరి ముఖకాంతి తగ్గలేదు. ఈజలము విషపూరితమనినైనఁ దలఁపఁజాల. ఈమాయఁ దెలియఁజాలక యుంటిని. సమస్త రాజ్యసంపదలు వైరుల పాలుఁజేసి, యరణ్యమునకు వచ్చిన నాకు విధాతృఁడింత దుఃఖముఁ దెచ్చి పెట్టెనుగదా! శపథముఁదీర్చి నేను పురమునకుఁ బోయితినేని యామె నన్నుఁజూచి 'నీతమ్ములేమయి'రని యడిగిన నేనేమని ప్రత్యుత్తరం బిత్తు"నని పెక్కుభంగుల వగచి, దాహమున కోర్వఁ జాలక యతఁడు సరోవరములోనికి దిగెను. అప్పుడాతని కెప్పటియట్లశరీరభూత మిట్లనియె. "ఓరాజా! ఈకొలను నా సొమ్ము. నేనొకబకంబను నాపలుకులు వినక నీతమ్ములిందలి

జలంబులం ద్రావి ప్రాణమ్యతిం బొందిరి. నీవును సాహసించితి వేని, వారివలె నయ్యెదవు నేనిచ్చు ప్రశ్నముల కుత్తరము లిచ్చితివేని కడు పారజలములం గ్రోలవచ్చును. ధర్మజుండా యశరీరభూతము నుద్దేశించి "అయ్యా! నీవు బకరూపముధరించిన బ్రహ్మవో- విష్ణుండవో-రుద్రుండవో ఎఱుంగంజాలకయున్నాను కేవలము పక్షి వేషమైనచో లోకైకవీరులగు నా తమ్ములనిట్లు సేయగల సత్త్వము నీకెట్లు లభించినది. నీ పలుకులు నాకుంగడునద్భుతముం గలిగించుచున్నవి. నీవెవ్వండవు? నీతలం పెట్టిది? కరుణించి, మెఱింగించి నాహృదయ వేదనం బాపు" మని పలికెను. అంతట నశరీరభూతము "నేను బకమును గాను- యక్షుండ. నామూలముననే నీ తమ్ములిట్లు ధాత్రి పై నొఱిగిరి-'' అని పలుకుచు భయంకరరూపముతో నతని యెదుట నిలిచి "నా యాజ్ఞలేనిదే యిందలి యుదకమునుం ద్రావినవారు చచ్చెదరు- నీవుమంచిచెడ్డలు విచారించువాండ వగుటం జేసి తొందరపడి జలములు త్రాగలేదు - కావున నేనడుగు ప్రశ్నముల కుత్తరములు చెప్పు''మనెను- ధర్మజుం డందులకు సమ్మతించి యాతండడిగిన ప్రశ్నములకెల్ల నుత్త రువులిచ్చెను-యక్షుండు సంతసించి 'ధర్మనందనా! నీబుద్ధివైభవ మునకానంద మందినాండను- నీతమ్ములలో నొక్కనిజీవింపం జేసెద. వేడు'మనెను. నకులుని బ్రదికింపుమనిధర్మజుండు కోరెను-అందులకుయక్షుండు "రాజా! భీమార్జునులుమహాబలపరాక్రమవంతులు. నీకుం బ్రియులు- ఏకగర్భ సంజనితులు. వారిం గోరక నకులు నేల కోరితి"వని యడిగెను. ధర్మజుం డిట్లు బదులు చెప్పెను. "మహాత్మా! మాతండ్రి కిరువురు భార్యలు.

కుంతికి తనయులైన మువ్వురిలో నేను బ్రదికి యుంటిని- ఇక మాద్రీతనయులలో నొక్కఁడుండ వలదా! ఈధర్మరాజు ధర్మ సంధుఁడని జనులు చెప్పుకొను చుందురు- ఎట్టి హాని వాటి ల్లినను, నేను ధర్మహానికి మాత్రమొడిగట్టను." ధర్మజుని ధర్మ సంధతకు మెచ్చి "ధర్మరాజా! నీతమ్ములు నలువురును లబ్ధ జీవితులయ్యెదరని బలికెను. వెంటనే భీమార్జున నకుల సహ దేవులు నిద్ర లేచిన తెఱంగున లేచి యుధిష్ఠిరునకు మోదముఁ గలిగించిరి.

ధర్మజుఁ డిదియంతయుఁజూచి విస్మయంబంది యక్షుని విలోకించి "మహాత్మా! నిన్నొక యక్షమాత్రుఁడుగాఁ దలంప రాదు. నీ వెవ్వఁడవో యొక మహానుభావుఁడవు. కరుణించి నీ నిజవృత్తాంత మెఱిఁగింపుమని గోరెను. అప్పుడు యక్షుండిట్లు వచించెను. "నేను ధర్మదేవతను నీచిత్తము బరీక్షించుటకు వచ్చితిని. నీధర్మబుద్ధి నాకుఁ బ్రీతిఁగలిగించెను, నీ కెట్టివరము కావలయునో కోరుకొనుము." ధర్మజుఁడాతనికి నమస్కరించి "దేవా! మాయాశ్రమ సమీపమునను న్న యొక భూసురుని యరణి యొకకురంగముచె నపహృతంబయ్యెను. దానికొఱ కిట్లువచ్చితిని. అయ్యది కరుణింపు"మని కోర "నేనే యిట్లొన ర్చితిని. హరిణ మెక్కడును లేదు." అని పలికి భూసురుని యరణి ధర్మరాజున కొసంగి "ముందుమీరు సలుపఁబోవు నజ్ఞాతవాసమున మీ కేరూపము గావలసిన - నారూప మల వడి మిమ్మెవ్వరునుఁ గనుగొనకుండునట్లు వరంబిచ్చితి"నని పలికి యదృశ్యుఁడయ్యెను.

# 12 బలిచక్రవర్తి

"గీ॥ బ్రదుక వచ్చుగాక ♦ బహుబంధములనైన
వచ్చుఁగాక ♦ లేమి వచ్చుఁగాక
జీవ ధనములయినఁ ♦ జెడుగాక పడుగాక
మాటఁ దిరుగలేరు ♦ మానధనులు."

పూర్వము రాక్షసులును - దేవతలును - నమృతము నకై మందర పర్వతము తఱచిరి. అప్పుడు శ్రీమన్నారాయణుఁడు మోహినీ వేషమున దానవులను మోసపుచ్చి యమృతమును దేవతల కిచ్చెను. అందుచేత దానవ చక్రవర్తి యగు బలి, దేవతలతో ఘోరముగఁ బోరాడి, యోడి పోయి, పశ్చిమ శిఖరికిఁ జనెను. ఈదైత్యులకు శుక్రాచార్యుఁడు గురుఁడుగా నుండెను. ఈతడు మృత సంజీవని యను విద్యా మహిమమున రణమున నీల్గిన రాక్షసుల నెల్లర బ్రదికించు చుండును. శుక్రుఁడు బలిచేత నొక గొప్ప యాగముఁ జేయించెను. దానినే విశ్వజిద్యాగమని చెప్పుదురు. ఆయాగము సేయుటచే బలికి, సువర్ణ రథమును, దివకరుని హయంబులఁబోలు హయములును, సింహధ్వజము- కవచమును - నగ్నిహోత్రుఁ డిచ్చెను. - శుక్రుఁడు శంఖ మిచ్చెను. ఇట్టివన్నియు లభించుటచేత నాబలి యఖండపరాక్రమ వంతుఁడై త్రిలోక భీకరుఁడై యొప్పు చుండెను.

కొన్నినాళ్ళ కాతఁడు దేవేంద్రుని సాధింపఁ దలఁచి చతురంగ బలములతోఁ బోయి దేవతా రాజధానియగు నమ

రావతిని ముట్టడించెను. ఆసమయమున నింద్రుఁ డమర గురుఁడైన బృహస్పతిని రావించి, ‘‘ఆచార్యా! బలిదైత్యుఁ డిప్పుడు మనమీఁదకు దండెత్తి వచ్చినాఁడు. వీని కిట్టి బల మెట్లు వచ్చినది “వీని నెట్లు గెలువఁ గలుగుదు’’మని పలికెను. బృహస్పతి యందులకు ‘‘అమరనాథా! శుక్రాచార్యుఁడు చేయించిన యాగమువలన నీతని కింత మహిమ కలిగినది. ఈతని నెదిరించుటకు శ్రీహరికిదప్ప నితరులకు శక్తిలేదు. ఈసమయములో నీవమరావతిని విడిచి పోవుటమంచిది. శుభ దినములు వచ్చినప్పుడు మరల రావచ్చు” నని పలికెను. బృహస్పతిమాటలు విని యింద్రుఁ డమరులతో నాకలోకము విడిచెను.

బలి యమరావతిని వశముఁ జేసికొనెను. శుక్రుఁ డతనిచే శతాశ్వమేధములుఁ జేయించెను. బలియొక్క రాజ్య పరిపాలనము ధర్మము ననుసరించి యుండెను. అతఁడు రాక్ష సుఁడైనను - దేవబ్రాహ్మణ భక్తి - ధర్మాసక్తి - గురుజనా నురక్తి - గలిగి యుండెను. - ఆతని పాలనమున దరిద్రులు లేరు. పాడిపంటలు సమృద్ధిగా నుండెను. ఈతీరున బలి రాజ్యముఁ బాలించు చుండెను.

ఇది యంతయు విని యింద్రుని తల్లియగు నదితి తన మనమున, బలి తన రాజ్యము నాక్రమించినందులకువిచారిం చుచుండెను. ఆసమయమున నచ్చట కామె భర్తయగు కశ్య పుఁడు వచ్చెను. ఆమె యాతనికి నమస్కరించి తన మనోవే దన యంతయుఁ దెలుపుకొనెను. కశ్యపుఁ డామెను జూచి

"ఇదియంతయు విష్ణుమాయ. నీవు హరిని సేవింపుము. శుభములనందగల"వని చెప్పి, శ్రీహరినిఁబూజించు క్రమముఁ దెలిపెను. అదితి శ్రీహరిని నిష్టతో సేవించెను-ఆ మహానుభావుఁ డామెకుఁ బ్రసన్నుఁడై "సాధ్వమణీ! నేను మాయోపాయమున దైత్యులనుఁజంపవలయును. ఎట్లయినను బలిగర్వము నడంచి యిందున్రకు రాజ్యమిచ్చెద. అందులకై నేనునీకు సుతుండ నయ్యెద" నని పలికి యంతర్థానుఁ డయ్యెను-

అదితికశ్యపుని సేవించుచుండెను. కొన్నాళ్ళకామె గర్భముధరించి కాలక్రమమున నొకశుభలగ్నమున శ్రీహరినిబుత్రునిగా, గాంచెను. ఎదుగుచున్న కొలందియుశ్రీహరి తనరూపమును మఱుగుపఱచి, కపట వటువై యుండెను. ఈవటుఁడే వామనుఁడు. కశ్యపుఁడాతని కుపనయనము గావించెను. వామనునకు బృహస్పతి జన్నిదమును, కశ్యపుఁడు ముంజియు, దితి కౌపీనము భూదేవి కృష్ణాజనము, సోముఁడు దండమును, సరస్వతి యక్షమాలికయు, సప్తఋషులు కుశపవిత్రములును నర్పించిరి. కుబేరుఁడు భిక్షాపాత్ర మిడెను. అందుఁ బార్వతి "అక్షయ" మని తొలిభిక్షఁ బెట్టెను.

దానము సేయుటయందు బలిచక్రవర్తిఁ జెప్పి మఱియొకరిని జెప్పవలయును. ఆతనితో సమానముగ దానము సేయువారెవ్వరునులేరు. అర్థులేదికోరిన నదియిచ్చును.వామనుఁడు బలింగూర్చి విని, యతనిం గాంచుటకుబయలుదేరెను. అప్పుడు దైత్య చక్రవర్తి యొక గొప్ప యాగమును సేయు

చుండెను. వామనుఁడు తిన్నగా నాపవిత్రదేశమున కరిగి సభా మండపమును ప్రవేశించెను. అది వేదపారాయణులగువిప్రుల తోడను, మంత్రివేత్తలతోడను, ననేక ముని పుంగవులతోడను. నిండియుండెను. వామనుఁడందుఁ బ్రవేశించి, నెమ్మదిగా బలింజేరి యాశీర్వదించెను. అచ్చట సభ్యులీ వామనునిఁ జూచి వేదము లీరూపమునందె నని తలంచిరి. బలి సింహాసనమునుండి దిగివచ్చి వామనుని చరణములకునమస్కరించి, తత్పాదములు కడిగి, యాజలము శిరముపైఁ జల్లుకొని సుఖాసీనుంజేసి కుల గోత్రనామము లడిగి - యిట్లుపలికెను. "భూసురోత్తమా! నీకేమి కావలయును. నీవు వచ్చుటం జేసి నేను కృతార్థుఁడ నైతిని. మఖముగూడ పావనంబయ్యెన్ను. వస్త్రములా! సూకలా! ఫలములా! గోవులా! కరులా! భూషణములా! భూములా! ఏమికోరెదవు." బలివాక్యములకు వామనుఁడు సంతసించి, 'నాకు నివాసమనునదియొకటి లేదు. నేను సర్వ ప్రదేశములయందు నిండియుందును. నేనె వ్వరివాఁడను గాను. అందఱును నావారే. లోకములో నేను కోర్వని దేదియు లేదు. నీవు మహాదాతవని నిన్నుఁ జూచుటకు వచ్చితిని. మీవంశములోఁ బ్రహ్లాదుఁడు గొప్ప యశమార్జించినాఁడు. నీవును నంతటి వాఁడవే. బ్రాహ్మణు లందఱివలె నిన్ను నిరంతరము యాచించుటకై వచ్చువాఁడఁ గాను. నేనొంటివాఁడను. కావున నాకు మూఁడడుగుల నేల యిచ్చినఁ జాలును." వామనుని వాక్యములకు బలి నవ్వి "ఓయి వెఱ్ఱిబ్రాహ్మణుఁడా! ఈస్వల్పమేనా! నీవు

యాచింప వచ్చితివి. యాచన యనగా నేమియో తెలియని వానివలె నుంటివి. మఱేమయినఁ గోరు" మనెను. మూడడుగుల నేలతప్ప, నొండెద్దియు వలదని వామనుఁడు చెప్పెను.

వామనుఁడు కోరినదానమిచ్చుటకు బలి సంసిద్ధుఁడయ్యెను. అప్పుడు శుక్రాచార్యుఁ డాతని గాంచి "ఓదానవలోకచక్రవర్తీ! ఈతఁడు నిజమయిన భూసురుఁడుఁగాఁడు. దేవతలకు మేలుసేయఁదలంచి వచ్చిన శ్రీమన్నారాయణుఁడు. నిన్ను వంచించి నీభాగ్య మింద్రునకీయఁ దలంచినాఁడు. మహాకాయుఁడై, మూఁడడుగులతో జగంబెల్ల నాక్రమించును. ఒక పాదమున భూమియు - నొకపాదమున నాకాశమును నాక్రమించెనేని నీ వెచ్చటికి వెడలఁ గలుగుదువు? వివాహములందును, ప్రాణవిత్తమానభంగములందును, నబద్ధమాడినఁ బాపములేదు. కావున నీదానము మానుమని పలికెను. బలిచక్రవర్తి యందుల కంగీకరించునా! ఆతఁడు శుక్రునిఁజూచి "ఆచార్యా! యిచ్చెదనని పలికి మరల లేదనిపలుకుటకంటెఁ బాపము మఱియొకటి లేదు. ఇదివఱకెందఱు రాజులీ భూతలమునుఁ బరిపాలించిరి. వారందరును సౌభాగ్యమునుమూటఁ గట్టుకొనిపోయిరా! శిబి మొదలగువారుచేసినదానము లెప్పటికైన మఱుపునకు వచ్చునా? క్రతువులఁగాని వ్రతములఁగాని చిక్కని మహాత్ముఁడు నన్ను దానమడిగినప్పుడీయనని చెప్పఁగలనా! నాసమస్త రాజ్యశ్రీలు పోయినను సరే. నాజిహ్వ తిరుగదు."

ఇట్లు చెప్పి యాబలిచక్రవర్తి వామనుని వాంఛఁదీర్చుటకుఁదన భార్యను హేమకలశముతో జలముదెమ్మని చెప్పెను.

బలి వామనుని జూచి "నీ వాంఛితము దీర్చుచున్నాను. నీపాదము లిటుదెమ్ము. కడిగెద" నని పలికి, యా మాయా మాణవకుని పాదములు కడిగి హస్తమున ధారవోసెను. ఇట్లు మూడడుగుల భూమిని దానముగా గ్రహించిన వటుడు, విశ్వరూపముధరించి, యొకపాదమును భూతలమును, వేఱొక పాదమును స్వర్లోకమును, నాక్రమించి, బలింజూచి, "దానవేంద్రా! నేను రెండడుగులే గైకొంటిని. మూడవ యడుగునకు బ్రదేశము గాన్పింపదయ్యెను. నీవిచ్చెదనని చెప్పితి. మూడవ యడుగుఁ జూపు" మని బలికెను. బలి, హరిం జూచి "దేవా! నేనసత్యమాడను. నీమూడవ పాదము నా శిరమున మోపుము. నీవు శ్రీహరి వని తెలియును. నీవు నన్నీ దానము గోరుట నాపుణ్యఫలమనితలంచెద"ననెను. అంతట శ్రీహరి యాబలి శిరముపైఁ బాదమిడి నీవారితో గూడ సుతలంబునకరిగి, మద్భక్తుఁడవై యచ్చట నుండుమని చెప్పి పంపివేసి, యింద్రునకు మరల దేవతా సామ్రాజ్యమునుఁ గూర్చెను.



## 13. శకుంతల — దుష్యంతుఁడు

చతురుదధివేలావలయితంబగు హస్తినాపుర రాజ్యమును, బూర్వ రాజన్యుల కీర్తివల్లికఁ బ్రాకించుచు, దుష్యంతుఁడను చక్రవర్తి పరిపాలించుచుండెను. ఆతఁ డొక్క దినమున మృగయావ్యాజమున నరణ్యమున కరిగి, పెక్కు మృగంబుల నుక్కడగించుచు ననతి దూరంబరిగె. వెంట

నరిగిన యాశ్వికులు వేటాడి యలసి; యందందు విశ్రమించి యుండిరి. దుష్యంతుఁ డొక మృగమును దఱుముచుఁ గొంత దవ్వుతో నతి దూరం బరిగెను. అచ్చట నతనికి సమస్త తరులతాపుష్పశోభితంబై నందన వనంబును బురుడింపఁజాలు నొక దివ్య వనము బొడఁగట్టెను. అవ్వన రామణీయత కతఁ డానందమునుఁ బొందుచు నందుఁ బ్రవేశించి, సమిత్కుశ పలార్థమై యచ్చట కరుదెంచిన మునిబాలుర చేనయ్యదికణ్వ మహాముని యాశ్రమంబని యెఱింగి, తన వెంటవచ్చిన వారి నట నుండఁబనిచి తాను కణ్వుని దర్శించుట కరిగెను.

దుష్యంతుఁ డొక్కఁడును గణ్వాశ్రమము బ్రవేశించి యందు భువనమోహిని చందమున రాజిల్లుచున్న శకుంతలం గాంచి, యామె రూపలావణ్యముల కచ్చెరుపుఁ బొందుచు నిలుచుండెను. శకుంతల యాతనింజూచి దుష్యంతుఁడని యెఱింగి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించెను. దుష్యంతుఁ డామెను విలోకించి ‟మృగయావ్యాజమున నరణ్యమున కరు దెంచి కణ్వమహాముని దర్శనముజేసి పోవవచ్చితిని అమ్ముని వల్లభుం డెచ్చటికరిగె'' ననిపలుక, ‟వారిప్పుడే వనంబునకు బండ్లు దేరఁబోయిరి. సత్వరముగనే యరుదెంతు"రనియామె బదులుచెప్పెను. శకుంతలను జూచినయంతనే నరపాలుని చిత్తము చలించెను. తనచిత్తము మునికన్యకపై కరిగినందుల కొకసారి విచారించెను. మఱియొకసారియామెనిజముగామునికన్యకయే యైనచోఁ జలింపదని తలంచెను. తుదకామెరాజకన్య యనియు, నవివాహిత యనియుఁ గృతనిశ్చయుఁడై యామెను విలోకించి "నారీమణీ! నీసౌందర్యమువరనాతీతమై

యున్నది. నీయన్వయాభిధానంబు లెట్టివి? నీవీ యాశ్రమమున నుండుట కేమికారణము" అని యడిగెను. అందులఁ గామె "మహారాజా! సకల ధర్మస్వరూపుఁడైన కణ్వునకుఁ గూతురను. శకుంతల యను నామమునఁ దనరు దాన,, నని బదులు చెప్పెను. దుష్యంతుఁడామెమాటలకుసంశయాస్పద చిత్తుఁడై మఱల నామెనుజూచి "సుందరీమణీ! బ్రహ్మచర్య వ్రతస్థుఁడైన నీవు కణ్వునకెట్లు కూతుర వైతివో యెఱుంగఁ దలచితి" ననెను- అంతట శకుంతల "రాజేంద్రా! మున్నొక మునీంద్రుఁడు నాజనకునికడ కరుదెంచినప్పుడు నాజనకుఁ డతనికి నాజననప్రకారమిట్లు చెప్పెను.

"తొలుత రాజర్షియై విశ్వామిత్రుఁడు సేయుచున్న ఘోరతపమునకు నింద్రుఁడు భయంబంది మేనకయనుదేవవేశ్యనుఁ బిలిచి, "నీవు కడురయముననరిగి, విశ్వామిత్రుఁడొనరించు తపమునకు విఘ్నముఁగలిగించి మమ్ముఁ గాపాడవలయు" నని పలికెను. అందుల కమ్మేనక దేవనాథునిఁ జూచి యిట్లు పలికెను. "అమరేంద్రా! ఆగాధేయుని కోపాగ్నికిఁ జతుర్దశభువనములునుభయంబందుచుండును. అతండొక్కింత యలిగిచూచెనేని లోకములన్నియు భస్మముగును. అట్టియెడల నబలనగు నేనాతని యెదుటకుఁ బోయి నిలువఁగలనా. అయినను నీయాజ్ఞ ననుసరించి యమ్మునివరుని పాలికిఁ బోయి నా నేర్చు తెఱంగునఁ దపమునకు విఘ్నముఁగలిగింపఁబ్రయత్నించెద. ఇట్లు పలికి మేనక హిమవత్పర్వత సమీపవనంబునఁ దపంబుసేయుచున్న కౌశికమునివరుని కడ కరిగి, యాతకి నమస్కరించి, పుష్పాపచయము సేయు నెపంబున నవ్వనం

మున విహరించుచుండెను. మేనకనుపీక్షించినయంతనే విశ్వామిత్రుని హృదయము చెదరిపోయెను. తపముఁ జాలించి యామెను తదేకదృష్టితోఁ జూడఁదొడంగెను. అంతట నాతఁడు నిష్ఫలవల్లి నీరు పాలు గావించి, యమ్మందయానకు లోఁబడెను. మేనక యామునియొద్దఁ బెద్దకాలముండి యీ శకుంతలంగాంచి, యొక్క మేటిపులినతలమునఁ బెట్టి, యమర లోకమునకరిగెను. విశ్వామిత్రుఁడును మేనకవలనఁ దనతపమున కంతరాయము కలిగెనని పశ్చాత్తాపమునంది, మరల దపోవనమునుఁ బ్రవేశించెను. మునివరుని తపఃప్రభావమున నచ్చటనున్న శకుంత పక్షులు శిశువునుఁ గ్రూరమృగంబులు స్పృశింపకుండఁ బక్షంబులఁ గప్పి రక్షించుచుండెను.

అంత నేనొక దినమున సమిత్కుశ ఫలార్థమై యా ప్రదేశమునకరిగి, శకుంతరక్షితమగు శిశువుఁగాంచి, యాశ్రమంబునకుఁదోడి తెచ్చి శకుంత రక్షితమగుటంజేసి శకుంతల యను నామంబిడితిని, నాటినుండియు నీమె నాకు గారాబపుఁ బట్టియై యున్నది."

శకుంతల జన్మప్రకార మంతయు వినిన విహారదట దుష్యంతుఁడు మోహావేశ పరవశుండై యెట్లయినను నామెను వివాహమాడదలఁచి యిట్లు పలికెను.

"క॥ ఈవల్కలాజినములకు
నీ వన్య ఫలాశనముల • కీ విటపకుటీ
రావాసముల కుచితమె
నీ విలసిత రూపకాంతి • నిర్మల గుణముల్."

ఉ॥ ఈమునిపల్లె నుండుటిది ♦ యేల కరంబనురాగమొప్పగా
భామిని నాకుభార్యవయి ♦ భాసురలీల నశేష రాజ్యల
క్ష్మీమహనీయ భాగ్యముల♦మేలుగ నందుమనింది తేందుపా
దామలతుంగ హర్మ్యముల♦హారిహిరణ్మయకుట్టిమంబులన్."
తరుణీమణీ! నిన్నువివాహమాడ నాకిచ్ఛ జనించినది. చతురుదధివేలావలయిత మహీతలంబునకుఁజక్రవర్తినైననా కిల్లాలుగా నుండఁదగిన నీవీ యరణ్యమున నుండుట తగదు. బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, రాక్షసము- ఆసురము- గాంధర్వము - పైశాచము, ననుయెనిమిది తెఱంగుల వివాహములు ధర్మశాస్త్రమునఁ జెప్పఁబడి యున్నవి. అందు క్షత్రియులకు గాంధర్వ రాక్షసములు ప్రశస్తములై యొప్పును-కావున నన్ను గాంధర్వవిధినిఁబరిణయంబాడుము.''

దుష్యంతుని పలుకులు విని యా శకుంతల యిట్లు చెప్పెను.

"క॥ కరుణా నిరతులు ధర్మ
స్వరూపు లింతకు మదీయ ♦ జనకులు సనుదెం
తురు వారు వచ్చి నీకి
చ్చిరేనిఁ బాణిగ్రహణము ♦ సేయుము నన్నున్.

ఎట్టకేలకు దుష్యంతుఁ డామెను సమ్మతిఁ బఱచిన నామె యాతనిని జూచి "రాజేంద్రా! నన్ను నీవు వివాహ మాడఁదలంచితివేని. నీప్రసాదమున నాకు జనించు కుమారుని యారాజ్యాభిషిక్తునిగాఁ జేయుదు.''నని వరం బొసంగ వలయును- అట్లయిన, సమ్మతించెద''నని పలికెను- దుష్యం

తుఁడు శకుంతల కోరినట్లు వరంబొసంగి యామెను గాంధర్వ విధిని వైవాహికంబాడి "తరుణీ! ఇఁక నేను పురంబున కరిగి నిన్నుఁదోడ్కొని వచ్చుటకు మంత్రి పురోహిత బృందమును గణ్వని సన్నిధికిబంపెద"నని చెప్పి నిజపురమున కరిగెను. నృపాలుండరిగిన పిమ్మట శకుంతల తాను చేసిన కార్యముఁ గణ్వుఁ డెఱింగిన నేమని కోపించునో యని విచారించు చుండెను. అంతలో ఫలంబుల కరిగిన కణ్వుఁడాశ్రమమునకు వచ్చిభయంబందుచు నెదుటనిలిచియున్న శకుంతలనువీక్షించి, సమస్తమును దివ్యదృష్టి నెఱిఁగి - యా యువిదంగాంచి "కుమారీ! నీవొక్కింతయు భయంబందవలదు. సమస్తమును నాకు గోచరమయినది, నీవు తగిన వరునిఁ గాంచితివి. గాంధర్వవివాహము ధర్మశాస్త్ర సమ్మతమైనదే! నీవిప్పుడు గర్భిణివైతివి- నీగర్భమున నున్న కుమారుఁడు చక్రవర్తియగును. నీసచ్చరిత్రమున నేను మెచ్చితిని-నీవు వాంఛించిన వరంబను గ్రహించెదను. కోరు''మని పలికిన, విని- శకుంతల మనంబున భయంబు విడిచి, కణ్వుని విలోకించి, యిట్లు పలికెను. "జనకా! నా చిత్త మనవరతము ధర్మమునందే వర్తించునట్లును, నా కుదయించు కుమారుఁడు వంశకర్తయు, దీర్ఘాయురారోగ్య బలపరాక్రమ సమన్వితుఁడునై యుండునట్లుగను వరం బనుగ్రహింపుము."

కణ్వుఁ డామె కోరిన వరంబుల నొసంగి, యామెను రక్షించుటకు మునికన్నియల నియమించెను- అంత శకుంతలకుఁ బదియవ మాసమున నొక కుమారుఁడు జనించెను- అక్కుమారునకుఁ గణ్వుఁడు జాతకర్మాది క్రియల నెఱవేర్చి

భరతుండను నామంబిడెను. ఆ భరతుఁడు దినదిన ప్రవర్ధమానుండగుచుఁ గణ్వాశ్రమ ప్రాంత వనంబులనున్న క్రూర మృగంబులఁ బట్టితెచ్చి, యాశ్రమంబున భూజంబులకు గట్టుచు బాల్యక్రీడలచే శకుంతలకును గణ్వునకును ముదంబుఁ గలుగఁ జేయుచుండెను-, అచటి మున్లంద్రు లెల్లరును నా కుమారుని సాహసగుణముల కద్భుతమంది, యాతనికి సర్వదమనుండని పేరుబెట్టిరి.

ఇట్లు కొంతకాల మరుగఁ గణ్వుఁడు శకుంతలనుఁ జూచి, "అమ్మా! ఎట్టి సాధ్వులైనను బుట్టినింటఁ బెద్దకాల ముండఁదగదు. సతులకెప్పుడును పతితోడ నుండుటయే ధర్మము. కావున నీవింకఁ బతికడ కరుగుట ధర్మము. నిన్ను దుష్యంతుని పాలికి మునికుమారుల తోడిచ్చి పంపెద" నని చెప్పిన-నామెయు సంతసంబున సమ్మతించెను. అంతట నా శకుంతలను భరతసమేతముగాఁ గొందరు మునికుమారులను దోడిచ్చి, దుష్యంతుని పాలికిం బంపెను. శకుంతల దుష్యంతుని దోడ్కొని దుష్యంతుని పాలికిఁబోయి, నిండు పేరోలగంబునఁ గొలువుఁదీర్చియున్న దుష్యంతునిఁ గాంచి నిలుచుండెను. ఆతఁ డీమెనుఁజూచి యేమియుఁ బలుకలేదు. శకుంతల తన మనంబున, "ఏమిది! ఈరాజేంద్రుఁడు నన్నుఁజూచియు బలుకక యున్నాఁడు. మున్ను నామొడలఁ జూపిన యనురాగమును, నను గ్రహమును - సంతోషమును, నేడు చూపక యున్నాఁడు. చూపులుగూడ మఱియొకతీరుననున్నవి. ఆనాడా శ్రమమున నీతఁడన్న వాక్యములను మఱచిపోయెను కాబోలు! అట్లు తలంపరాదు. మఱచిన వానికిఁ జ్ఞప్తికిఁదేవచ్చు

గాని, యెఱిఁగి యుండియు మాట్లాడని వాని కెఱింగించుట కష్టము. అయినను వచ్చిన దానిని భాషింపకుండఁ బోవుట యుచితము" గాదనితలంచి రాజేంద్రునిఁజూచియిట్లు పలికెను. "నృపాలచంద్రా! వేఁటనెపమునఁగణ్వాశ్రమమునకరుదెంచి యచ్చట నాకొసంగిన వరంబులఁ దలంపుము. ద్యుమణి సమాన తేజుఁడైన యీకుమారుఁడునీతనయుఁడు. పౌరవకుల రత్నాలంకారుఁడైన యీతనిని యువరాజుగాఁ జేయుము." ఆమె పలుకులకు దుష్యంతుఁడు, "అబలా! నీవెవ్వరవో నే నెఱుంగను. ఇట్టి యనుచితవాక్యంబు లాడ నీకుఁ దగదు. ఎక్కడనుండి వచ్చితివో యక్కడి కరుగు" మని పలికెను. దుష్యంతుని నోటినుండి వెలువడిన యీవాక్యములకు శకుంతల నిశ్చేష్టిత యయ్యెను. కన్నులవెంట జలములు బయలు దేరెను. సంతాపమంతయు నడంచుకొని యధ్ధరాతలేంద్రున కామె యిట్లనెను. "ప్రాణేశ్వరా! సమస్తము నెఱింగియుం డియు నెఱుఁగనని వచించినంతమాత్రమునఁ దప్పిపోవునా? ధర్మమూర్తివగు నీవు తప్ప నెవ్వరును నెఱుంగరని తలంచుట భావ్యమా? వేదములు, పంచభూతములు, ధర్మువు, రాత్రిం బవళ్ళు, సూర్య చంద్రులు, యముఁడును జూచుచుండఁగా నరుండు దానుచేసిన కార్యమును దాచినను దాగునా? నీవు కణ్వాశ్రమమున నాకొసంగిన వరములు జ్ఞప్తికిఁ దెచ్చుకొని నన్ననుగ్రహింపుము. గుణవతియగు సతిని నీచదృష్టిం జూచువాని కిహపరము లుండవని ధర్మ శాస్త్రములందుఁ జెప్పఁబడియున్నది. సకల ధర్మార్థ కామ్యసాధనంబులకును, భార్యయే యుపకరణము. అట్టి భార్య నవమానించుట

యధర్మము- నృపాలా ! ఈ విపరీతమైన పలుకు లిఁక జాలిం పుము. ఈ పుత్రుని జేకొనుము. ఆనాటి వాక్యము లసత్యములుఁ జేయకుము.

చ॥ నుతజల పూరితంబులగు నూతులు నూటికంటె సూ
నృత! వ్రిత! యొక బావిమేలు మఱి బావులు నూఱిట
కంటెనొక్క స॥ త్క్రతువది మేలు తత్క్రతు శతంబున
కంటె సుతుండు మేలు త॥ త్సుతు శతంబునకంటెనొక
సూనృతవాక్యము మేలు సూడఁగన్.

కావున నీవు నిత్య సత్యవాక్య పరిపాలనమే తలంచి యానాటి వాగ్దానముఁ దీర్చుము. మహా తపోనిష్ఠాగరిష్ఠుఁడైనవిశ్వామిత్రునకుఁదనయనైన నేనసత్యముపలుకుదునా?'

ఇట్లు శకుంతల పలికిన వినియు నానృపాలుఁడు "నేనెవ్వఁడను నీ వెవ్వతవు? ఈ కుమారుఁ డెవ్వఁడు? నేనేమియు నెఱుంగను. ఈసభాసదు లందఱు వినుచుండఁగా నిట్టి యసత్యములు పలుకుట నీకుఁ దగదు- పొమ్ము." అని గట్టిగాఁ బలికెను- అనవుఁడు శకుంతల మిగుల దుఃఖించుచుఁ గన్నులవెంట నీరుగార్చుచు నింక దైవంబే శరణంబగుఁగాక" యని తలంచి పోవనున్న సమయమున నాకాశవాణి "దుష్యంత నృపాలా ! ఈకుమారుఁడు నీకును శకుంతలకును జన్మించినాఁడు. ఈమె మహాసాధ్వి శంకింపక చేపట్టుమని పలికెను. అంతట దుష్యంతుఁడు సభాసదుల కందఱి సత్యము నెఱింగించి శకుంతలను గ్రహించి, భరతుని యువరాజ్యంబున కభిషిక్తునిగాఁ జేసెను.

# 14 జరత్కారుఁడు



పూర్వము జరత్కారుండను నొకమునివరుఁడు సంసార స్థితిచే దారా పరిగ్రహంబు సేయనొల్లక బ్రహ్మచర్య వ్రత పరిపాలకుఁడై యొప్పుచుండెను. అతఁ డొకనాఁ డరణ్యమున కరుగ దల్లకిందైై యొక వృక్షమునకు వ్రేలుచున్న కొందఱు మునీంద్రులఁ గాంచి, వారిని సమీపించి "మహాత్ములారా! మీరున్న విధంబిదియొక తపమా! దీనింగూర్చి నాకుఁ జెప్పుం''డనిల - నయ్యధోముఖ విప్రులా జరత్కారుంగాంచి యిట్లు పలికిరి. "అనఘా! ఇది యేమితపము! దుఃఖితులమై సంతాన చ్ఛేదమున నధమలోకమున కరుగుట కిట్లు వ్రేలాడుచున్నాము. మాకులమున జరత్కారుఁడను నొక పాపాత్ముఁడు పుట్టినాడు. ఆతఁడు వివాహమాడి సంతానము గాంచక యున్నాఁడు. ఆతనికి మేము పితృ పితామహులము, మేము పట్టిన యిన్నివ్రేళ్ళనుయముఁడు మూషక రూపమునఁ దరతరంబుఁ గొఱికివేయుచున్నాఁడు. ఇంక నొకటి మాత్రి మున్నది. జరత్కారుఁడనపత్యుఁడైనచో మేమధోలోకమున కేగుదుము. నాయనా! నీవు మాబాంధవుఁడవలె నున్నాఁడవు. నీవా జరత్కారు నెఱుంగుదువేని మమ్ములఁగూర్చి యాతనితోఁ జెప్పు"మని నుడివిరి. ఆపలుకులు విని సంతానార్థము వివాహము నాడవలయుననితలంచి జరత్కారుఁడు వారినిఁజూచి 'మీరు నాపితృదేవతలు. నేనే

మీసుతుఁడ. మీవాక్యములు విన్నంతనే భార్యా పరిగ్రహముసేయ బుద్ధి వొడమిన' దని పలుక, వారాతనితో- 'నీవు వివాహమాడి సంతానమువడసి మాకూర్ధ్వలోక గతులఁ గలిగింపు' మనిరి. జరత్కారుఁడు వారితో సనామయమైనదానిని వివాహ మాడెదనని చెప్పి నమస్కరించి యటనుండి వీడ్కొనెను.

అనంతరము- ఆతఁడు బయలుదేరి సనామ యగు కన్యకకై భూలోక మంతయు వెదకెను. కాని, యట్టిదతనికి లభింపదయ్యెను. ఇట్లుండ సర్పరాజగు వాసుకి సనామమైన కన్యకొఱకు జరత్కారుఁ డన్వేషించుచున్నాడని విని తన చెల్లెలగు జరత్కారువను దోడ్కొని యతనిపాలికి వచ్చి "బ్రాహ్మణోత్తమా! ఈమె మదీయ సోదరి. జరత్కారునామధేయ. దీనిం బరిగ్రహించి నన్నుఁ గృతార్థుని జేయు" మని పలికెను. జరత్కారుఁడు సమ్మతించెను. వాసుకి వారిరువురకును వివాహము జరిపెను. జరత్కారుఁడు తన భార్యతో "ఎన్నఁడామె తనకవమానము దలంచునో యప్పుడు వాసిపోవుదు"నని ప్రతిజ్ఞఁజేసెను మగఁడొనర్చిన ప్రతిజ్ఞకు భయంబంది యామె పతిని నతిభక్తితోసేవించుచుండెను. ఇట్లుండ నొకనాఁడు జరత్కారుఁడు నిద్రిందగిలి సూర్యాస్తమయ సమయ మగుచున్నను లేవకుండుటఁ జూచి యాజరత్కారువ తనమనంబున సంధ్యయందుఁ జేయవలసిన విధులు గడచినచో ధర్మ లోపంబగును. నిద్రనుండి యాతనిని మేల్కొలిపితినేని నిద్రాభంగము గలుగఁజేసితివని యేమని కోపించునో,, యని తలంచి యెట్టకేలకు

చిత్తయై పతిని మేల్కొలిపెను- జరత్కారుఁడు నిద్రలేచి యింతింజూచి "నాకేల నిద్రాభంగముఁ గలిగించితి" వని యడుగ "సూర్యాస్తమయమగుచుండుటం జేసి మేల్కొల్పితి" నని యామె బదులు చెప్పెను. జరత్కారుఁడు భార్యంజూచి "నేను మేల్కొనకుండ సూర్యుఁ డపరగిరిం జేరఁగలఁడా? నీవు నాకవమానముఁ జేసితివి. తొల్లి నేనొనర్చిన శపథము ననుసరించి నిన్నుం బరిత్యజించెద- నీగర్భమున నుభయకులవర్ధనుఁడగు పుత్త్రుఁ డుదయించును- నీవు నీ యగ్రజునిపాలికిఁబొ"మ్మని పలికి, యాతఁడు తపోవనమునకుఁ జనెను.

సంపూర్ణము.



తెనాలి లలితా ముద్రాక్షరశాలయందు ముద్రితము.